శ్రీగురుభ్యోన్నమః,



# గురుధర్మసారావళియను

## అద్వైతకీర్తనలు.



ఇది

శ్రీపోతులూరి వీరబ్రంహ్మేంద్రస్వాములవారి

శిష్యపరంపరలో నొకరైన

## చుండూరు రాఘవయ్యాగారిచే

రచియింపంబడిన

తత్వకీర్తనలుకొన్నియును

తొల్లింటిపెద్దలచేరచియింపంబడిన

తత్వకీర్తనలుకొన్నియును

రాగతాళములతోడ

చక్కగా పరిశీలించి

వె. నా. జూబ్లీముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపంబడియె.

---



మొదటికూర్పు ౧౦౦౦-కాపీలు

౧౯౨౧-సం॥ డిశంబరునెల ౧౫-తేది

దీనివెల ౩-అణాలు.

# సద్గురుశిష్యపరంపర.

నందిమండలక్షేత్రం కందిమల్లయపల్లెగ్రామ మ
వాసరూపులయిన శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకు
న అవతారస్వరూపులయిన శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్ర
స్వాములవారి పుత్ర పౌత్రులయిన శ్రీ యీశ్వరమ్మవారి శిష
సురిమెళ్లగ్రామనివాసులయిన తిరుపిధి బయ్యగారు వ
ష్యులు పొదిలెసీమలో చేరిన గుండ్లసముద్రగ్రామనివాసు
అనేక చైతన్య సంరక్షకులయిన శ్రీవేమా లక్ష్మణాచార్య
స్వాములవారు వారిశిష్యులు అనగా శేవాన శేవకుండు
రుజిల్లా-వంగవోలుతాలూకా సంతనూతలపాటి గ్రామ
సులయిన చుండూరు రాఘవయ్యగారిచే రచియించి ప్ర
పంబడెను.

## ప్రకటన.

ఈమోక్షగ్రంథమును మోక్షాపేక్షగలిగి వలయు
రలు చెన్నపట్టణం వరదాముత్తియప్పన్ వీధిలో నెం.౧౧
గృహములో సదా విక్రయింపబడును.

# విషయసూచిక.

౬౩. అతడు బ్రాహ్మణుడు నమ్మి అవనిపై
౬౪. సక్కశూనకరికేసని కొడువనికే

దూదేకులసిద్ధయ్యగారు చెప్పినకృతులు

౬౫. అయ్యవీరబ్రహ్మానందయోగిపరాక
౬౬. ఈపలుకులోవందు వెలయంగనే
౬౭. దగ్గరయుండటగో మోక్షము
౬౮. చిక్కదయ్యా బ్రహ్మముదక్కదయ్యా
౬౯. శూరులైనవారు బ్రహ్మానంద
౭౦. అందరానిమానిపండు
౭౧. వట్టిఆచారములుకష్టమేమిటికి
౭౨. ఏలకలుగును ముక్తిమార్గము
౭౩. దొరుకునను ముక్తిదొరుకున
౭౪. బ్రాహ్మణులైతే శరణుచేసెదను
౭౫. ఏకేవారము దూదేకేవారము
౭౬. ఏటివారని చెప్పరేమున్నదయ్యా
౭౭. సిద్ధిబొందెదనని చెప్పేరు శూరహర
౭౮ ఏలనీమోహమిడజాలవే సీ
౭౯. పలుకుపలికే వినరా

గోవింద భొట్లుగారి కృతులు.

౮౦ నన్నుకులమడిగేది న్యాయము తమ
౮౧ ఏజాతిపుట్టినయెక్కునేగాద
౮౨. అజపగాయత్రిపరియుంచు
౮౩. చక్కరపంటిదిపండు

తిరువీధిబాబయ్యగారు చెప్పినకృతులు.

౮౪. బ్రహ్మనిష్ఠుడైనందుకు గురుతు
౮౫. శివోహంశివోహంసోహం
౮౬. కాశికిపోవలెనా తీర్థము మోసుక
౮౭. నడిమికంటిలోను నారాయణు
౮౮. అందమైనపువ్వులుగోతావూ
౮౯. బాలనుకృష్ణుజాడుయీశ్వరి
౯౦. పాలుగొనరేఅమ్మలార పాలు

వేమలక్ష్మీపతిఅయ్యగారు చెప్పినకృతులు.

౯౧. అష్టేవారముదినుసప్తేవారము
౯౨. ఆర్యశ్రీబాపనార్యశ్రీతురిమెళ్ల
౯౩. పతిమాటినిగురుఎతితమయెప్పుడు

చుండూరు రాఘవయ్యగారు చెప్పినకృతు

౯౫. అంబానను బ్రోవవే
౯౬. అన్నపూర్ణరావే నాయకన్నతల్లి
౯౭. నిను వేడితితల్లిననుబ్రోవవే
౯౮. దేవినిన్ను విడువజాలనే
౯౯. గురుకరుణచేగగనకుంభకంబుల
౧౦౦. ఇహపరములును
౧౦౧. మలినమింతయులేక
౧౦౨. శ్రీగురుడుపరమనేచిత్రాసన
౧౦౩. సుఖరాజయోగంబుసుందరం
౧౦౪. ఇదియెపరమానంద మింపుతో
౧౦౫. ఎందులకుగురునిపాదమెరుక
౧౦౬. బ్రహ్మబోధతెలుసుకొనవోయి
౧౦౭. పలుకూప్రణవమెస్వరములులం
౧౦౮. బ్రహ్మకులము వారిచిన్నది
౧౦౯. గురునిభజించ వెతుమ్మెద
౧౧౦. తరుణిగురుడెంతటివాడే
౧౧౧. తరుణిసద్గురుబోధ
౧౧౨. మొరచిన్నదొకటుందిమోదిం
౧౧౩. రసముచిల్కురా రామరసము
౧౧౪. గురుమణియున్నది గురుతుతెలి
౧౧౫ పరమగిరిమార్గంబుపట్టుక
౧౧౬. కొట్టరాభేరికొట్టరా గురుమండ
౧౧౭. సురతాగవలెరాను స్థిరముతోనై
౧౧౮ అంతనీవుబ్రహ్మమయమేగా
౧౧౯. రసముపానముశాయవలెను
౧౨౦ ఏటికేజన్మమేటికే
౧౨౧. శరణుజొచ్చినవాడెగురుడ
౧౨౨. ఏవూరయ్యా [illegible] దేవూరు
౧౨౩. నాకన్నవాడనినిన్నునే
౧౨౪. అంబనీకుయిదుగోమంగళం
౧౨౫. లాలిమద్గురువర్యలాలి
౧౨౬. జీవనీవచ్చినతావు
౧౨౭. మేలుకొనుసురలోకవర్యా.

పూర్ణానందస్వామి చెప్పినకృతులు.



శ్రీగురుభ్యోనమః.

# గురుధర్మసారావళియను

## అద్వైతకీర్తనలు.



—*(యాగంటి లక్ష్మప్పగారుజెప్పిన కీర్తనలు)*—

౧—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఎంతపాపకర్మినో యేపూర్వమునశివ -
చింతశాయనికర్మిజీవుండనైతిగా ॥

చరణములు.

మొదలుకష్టంబైనమురికిగర్భముయెందు - ఉదయించినాదేహ
మిదియెగాద । పదగిమలమూత్రముల ఉనికిపట్టైనట్టి - ఇదియెప్రత్యే
క్షనరకంబులివియుగాద ॥ ఎంత ॥ నెట్టణంబునసతులు నెలనెలకు వొక
సారి - ముట్టురక్తముజూచిముట్టరోసి । అట్టియాచండాలిశుక్లరక్తంబ
లసి । ఇట్టైననాదేహమిదియెగాద ॥ ఎంత ॥ ఒడలు బహుయోనికూప
ములందు - ఎడలిచేదుఃఖములకుడచికుడచి । కడకర్మినైతియాగంటి
నందయదేవ - ఎడబాయకనన్ను యేలుకోస్వామీ॥ ఎంతపాపకర్మినో॥

౨—రాగంకేదారగౌళ.

పల్లవి.

పోయకాలమువృథపోకలైజనులారపవుపాయమునశివునెరిగెదరుమీరు॥

చరణములు.

కలిమిలేములచేతఘనచింతనలచేత - కలహములచేత హంకా
రంబుచేతగా । కులమదంబులచేతకూహకంబులచేత - చలముచేతను
కుజనసంగంబుచేతగా ॥ పోయ ॥ ఒట్టియాశలచేతవైభవంబులచేత -
పట్టుపసలేనిదుర్భామినులచేతగా । చుట్టపక్కముచేత సుఖదుఃఖములచే

త - గట్టైనమోహాంధ కారంబుచేతఁ ॥ పోయ ॥ బలుమతంబులచేత
బహుచింతనలచేత - బలమైనసంసారబంధంబుచేతఁ । దలపయోగ్యం
టిగురుతత్వయుక్తంబైన - దెలియగాలేనిసందేహంబుచేతఁ ॥ పోయ
కాలమువ్యర్థపోకలై జనులార ॥

౩—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

ఏటిశైవముమరియు యేటివైష్ణవ మతము ।
ఏటిఆచారంబు యేటిమార్గములు ॥

చ ర ణ ము లు.

బొంకకనుసత్యంబుపోనియ్యకెప్పుడును - అంకింప జిహ్వకును
అదియెశుద్ధి । శంకలేకదానంబుజేయుటకుతగినట్లు - బొంకకనుచేతికిని
బూన్పుటేశుద్ధి ॥ ఏటి ॥ పరసతులనుచూచిపట్టరాదనిహెచ్చి - స్థిర
ముగనిలచినదెహశుద్ధి । నిరతమునుచాడియునునిందయును శాయకన
స్థిరకాలమున్నదేచిత్తశుద్ధి ॥ ఏటి ॥ పంచేంద్రియములనుపారనియ్యకె
ప్పుడును - మంచితనముననిలుపుమనసుశుద్ధి । ఎంచియాగంటీశు నెనె
శ్రాపాణాంగమున - అంచెరిగిపూజింప ఆత్మశుద్ధి॥ఏటిశైవముమరియు ।

౪—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

సతుల మోహముచేత సతమతముగాకఁ ।
మతముదెలసినయట్టి మనుజుడెయోగి ॥

చ ర ణ ము లు.

చందనగందులయెగుపుజిమిరికుచములచూపు - కుందనపుబ
గాగుకుండలనబోక । కందువతోఁ అవివ్రుమ్మిత్తైకాయలుగభావించి - పో
దుకోరకయున్నపురుషుడేయోగి ॥ సతు ॥ బెదరిచూపులచెలియపె
విమూంసపుతునక - తుదలేనిమధురంపుదొండపండనక । గడుముకో
అవివేపకాయలుగభావించి - చదరకుండినయట్టిసరసుడెయోగి॥ సత
కలికికిస్న [illegible] కాసివాటముచూచి - కలనైన అవి తెల్లకలువలనబా

కులహీను అవినత్తగుల్లలుగ భావించి చెలగియాగంటి గుహచేరు టె యోగి ॥ నతుల ॥

౫—రాగం ముఖారిరూపక తాళం.

పల్లవి.

మంటిదిరయిదిబొమ్మ - నీమనసుదెలసుకొమ్మ ।

అనుపల్లవి.

ఎంచకపంచభూతములై దుయేపుచున్నదియంతవారికిని ॥మంటి॥

చరణములు.

ప్రపంచమంతయుజెందె పరమాత్మునిమదిలోనమ్మి - విపరీతము గవిరూపాక్షునిగని అపరంఅపరంఅపరాధనుడీ ॥ మంటి ॥ నిత్యముగా దిదినమ్మి నిటలాక్షునిమదిలోనమ్మి - సత్యముతప్పకచానకబ్రతికెవు నిత్యసంపదనిలకడకనుమి ॥ మంటి ॥ గురుపుత్రులగనుగొనుమి మదిగు హుతెరిగిశరణనుమి - విటివిగశరణులపొడకనినప్పుడె శరణు శరణు శరణార్తియనుడి ॥ మంటి ॥ నవదరవాజులపేట నిటలాక్షుడు నిలచినకోట-వాటముగ శ్రీయాగంటీశుడు నేటుగనిలచిననిర్మలబాట ॥ మంటిదిర॥

౬—రాగం భైరవి అటతాళం.

పల్లవి.

చెలిమిచెప్పెదబుద్ధిచేకొనినీదు చలనముడిగింపవేచిలుక ।

అనుపల్లవి.

కులములోవైరంబుకొరగామిక్కిలి కూడువెళ్లకయుండుచిలుక ॥

చరణములు.

చింతలన్నియుమానిచెలరేగియాశివ చింతమీదనెయున్నచిలుక । వింతచదువులుచదివి విడువకనుయామీద వేదాంతములుచదువుచిలుక ॥ మంతనంబుననుండిమతిచెడియిలబుట్టి మరులుకొనిపోకువే చిలుక । పంతగాండ్లనుగూడిప్రతియాశలకుబొరి పట్టుబడిపోకువేచిలుక॥ చెలిమి॥మెట్టుమెట్టుననుండిమీదులకు మీదైనమీదికొమ్మలనున్నచిలుక । గుట్టుతోయామీదకుదురుకొనియాదిగువ కొమ్మలకురాకువేచిలుక । పట్టిముట్టగరానిబట్టబైటనుతేనె పండుపండిననోర చిలుక । పట్ట

పసలేనిదుర్భావములకెన్నోవిపండ్లకునురాకువెచిలుక ॥చెలి॥ పరికించి పంచశరుపట్టులనుబడకయా గురితోడనేప్రొద్దుచిలుక।ఛరితముగవెన్నెలబైటపంజరములోప్రాణపదమైయ్యున్నచిలుక । గురుడైనయాగంటిగురుపాదములునమ్మి యాగురిగడచిరాకువెచిలుక । సిరులుమాయనితెలసిజీవగుణమనియెరిగిమరుమేతలకురాకుచిలుక ॥చెలిమి॥

౭—రాగం ధన్యాసి తాళం రూపకం.

పల్లవి.

సంసారైతెమాయనుతనలో సంశయముడిగుంటె ।

అనుపల్లవి.

హంసస్వరూపంబాత్మలోగూర్చి ఆనందముతోనుంటె ॥

చరణములు.

సాధకమునగురుబోధకుతిరుగుచు గాధలబడకుంటె । మోదముతోమృదునాదంబనితాక్రోధరహితుడైతె ॥సం॥ మధురామృతపానముచేయుచుమనసుపదిలమైతె।చదరకదహరాకాశమందుగుణశాంతమొందియుంటె ॥సం॥ సుగుణముభజియింపుచుతనలోత్రిగుణములుడిగుంటె। అగణితశివయోగానందాబ్ధిలో ఆడుచునెపుడుంటె ॥సం॥ నిగమగోచరునినీరజయుగమం దభినుతింపుచుంటె । తగులుడిగీషణత్రయములనంటక తనుతాదెలనుంటె ॥సం॥ ఎడబడకెప్పుడుషడులింగార్పణ మెఱుకగలిగియుంటె । కుడియడమనుశివపంచాక్షరములునుడువుచుతావుంటె॥ సం॥ తడయకపవనుడునడిత్రోవనుజనితన్మయమందుంటె । కడువేగమెశ్రీయాగంటీశుని కరుణగలిగియుంటె ॥సంసారైతెమాయనుతనలో॥

౮—రాగం భైరవి అటతాళం.

పల్లవి.

సతతంబుమదిలోనశాంభవిముద్రచే శంభునారాధించుచిలుక ।

అనుపల్లవి.

ప్రతిలేనికైవల్యపదవిసిద్ధించునె ప్రతిదినానందమైచిలుక ॥

చరణములు.

భువిమీదజీవుడైపుట్టుచునుఅదియానకవగూడబోకువెచిలుక।

భవములనుపొందక పరమాత్ముడగుగురుని పదపద్మములునమ్ముచిలుక ॥ సత॥ సవిశేషత్రివిధప్రసాదమంత్రముగ్రోలి సాధించిమనవలెనెచిలుక। అవిరళంబుగఆత్మఆకాశమునగూర్చి అన్నిచింతలుమానుచిలుక ॥సత॥ పరగడెబ్బదిరెండువేలనాడులలోన పంజరంబుననున్నచిలుక। అరయ దీనికితొమ్మిదైనరంధ్రంబులె అన్నిటికివకతలుపుచిలుక ॥సత॥ గురుతైనసర్వాంగకొలదిముప్పదిమూడు కోట్లరోమంబులేచిలుక । దరులురెండైనట్టిదంతవజ్రపుతలుపు తలవాకిటలోనుచిలుక ॥సత॥ నిరతమునునిమిళితానేత్రముననాసాగ్రనిష్టపెనుగుచుమెుండుచిలుక । గరిమెచంద్రార్కులరగంటిసద్భావమున కదలకనుమెలగవెచిలుక ॥సత॥ పరగనంతర్లక్ష్యబాహ్యదృష్టికమై పరగతేజోరాశిచిలుక । భరితుడగుయాగంటిపతిదయనుఆనందపదవిచేనొందవేచిలుక ॥సతత-బుమదిలోన॥

౯—రాగము అఠావేరి ఏకతాళము.

వాడవాడచెలియలెల్లజోడుజోడుకూడుకొని మంచినీళ్లభావిలోనుముంచులాడగ ॥ మంచినీళ్లభావిలోనుమెుంచరానిచెట్టుబుట్టె మెుంచిచూడుచెలియలారయేమిచోద్యము ॥ కొంచమైనకొరకరాదులక్షలైనవిరువరాదు పంచనున్నబల్లిపిల్లబండిమ్రింగెర । పంచనున్నబల్లిపిల్లబండిమ్రింగెనంటచూస్తె పొలముతిరిగెపెద్దమేకపులినిమ్రింగెర ॥ పొలముతిరిగెపెద్దమేక పులినిమ్రింగెనంటజూస్తె కాంతతిరిగెకోడిపుంజు రోలుమ్రింగెర ॥ కాంతతిరిగెకోడిపుంజురోలుమ్రింగెనంటజూస్తె వూరుతిరిగెపందికూనగమినిమ్రింగెర ॥ వూరుతిరిగెపందికూన గమినిమ్రింగెనంటజూస్తె వూరివెనకరావిచెట్టువుడతమ్రింగెర ॥ వూరువెనకరావిచెట్టు వుడతమ్రింగెనంటజూస్తె కాకులరచిచుక్కలన్నికలియమ్రింగెర ॥

౧౦—రాగము కల్యాణి చాపుతాళము.

పల్లవి.

తల్లికినినివునుతుడవందురుధరణిలోప్రఖ్యాతిగ ।

అనుపల్లవి.

తల్లికినినివుమెుగుడవందురుతత్వమెవరికితెలియదు ॥

చ ర ణ ము లు.

తల్లితండ్రివి లేనివాడవు దైవమేనీవందురు । కల్ల గాదిదినిజము గ యాగంటిరాయకృపానిధే ॥తల్లి॥ కొడుకుకొడుకుకుబుట్టలేదట కొడుకు గురు తేమెరుగవు । కొడుకుతల్లికిమొగులు అగ్గురుకోరిమిము సేవింతురు । కొడుకుతండ్రికిపుట్టలేదట కొడుకులోనె వుంటివి । కడు చిత్రాము దేవిము యాగంటిరాయకృపానిధే ॥తల్లి॥ తల్లితండ్రికిసుతుడవై మొగనాలిపరు పడినుంటివి । ఆలికొరకై క్రిందుమీదుగ అదనుచేతన పడితివి । ఆలు మొగనికి యెగ్గులేదని అర్థమెవరికి తెలియదు । కామితా ఫలదాయకా యాగంటిరాయకృపానిధే ॥తల్లి॥ మామకును పెండ్లామని స్త్రీవి మామ కల్లుడవై తివి । మామకూతురు చేసుకొంటివిమంచివికనీ వావులు । మామబంటుగ చేసుకుంటివిమామకునుబంటైతివి।కామితఫలదాయక యాగంటిరాయకృపానిధే ॥తల్లి॥ వరుసపంచాష్టకము చెప్పిన వానినర్థమునడిగిన । వరుసతో నెరజాణ తెలిసి తెవాడె అష్టవధానిర । స్థిరముగ యిం నుగుభావన తెలిసినతడెధీరుడు । కరుణకోరికలిత్తురట యాగంటిరాయ కృపానిధే ॥తల్లికిని॥

౧౧—రాగము కల్యాణి అటతాళము.

ప ల్ల వి.

రాళ్లకుమ్రొక్కే-రు-క్రమముతప్పి-రాళ్లాకుమ్రొక్కే రు ॥

అ ను ప ల్ల వి.

రాళ్లకుమ్రొక్కే-రు-వరుసదప్పి-రాళ్లాకుమ్రొక్కే రు ॥

చ ర ణ ము లు.

మొదలేటిలింగమునుడివి దెలియలేక - మొదలనిలింగముమొదగట్టుక । కదసినాదుబిందుకళలచెలంగేటి - కదలికప్రాణలింగాముగానక ॥రాళ్లాకు॥ జీవుడుకడ తేరిచేరినచో టేది జీవుడెప్పుడుయుండుభావమేది । జీవాత్మపరమాత్మ జేసినప్రకృతియె తావునయుండేటితత్త్వాముగానక ॥రాళ్లాకు॥ వస్తువుతనలోనవనరొప్పుచుండగ విస్తరించిచాలవెతకినట్లు । మత్తులైజనులెల్లమాయకులోనైరి వస్తువుయాగంటివరయోగిగానక ॥రాళ్లాకు॥

# అద్వైతకీర్తనలు.

## ౧౨—రాగము నాదనామక్రియ అటతాళం.

పల్లవి.

రెంటినడుమనూటున్నదిదాటేవారికి - నదిదాటేవారికి

చరణములు.

రెండుసంగడికాయలుగట్టుక రేవుకుతిరిగేదేమిటికి । రెండుజ్యోతులుమర్దించుకొని మెలుగుచుపదరఆవలికి ॥రెంటి॥ చీకటిచింతలలో పలదొంగలభయమున్నదిమనకందరికి । గురుసూత్రంబనెగుడపదీసుకొనిగదమాపదరఆవలికి ॥రెంటి॥ లింగంపల్లెపాలిమేరదాటితెదొంగభయములేదందరికి । సంగతిగమనయాగంటీశుడు సర్వముదెలిపెమనందరికి॥ రెంటినడుమనూటున్నదిదాటేవారికి ॥

## ౧౩—రాగము నాదనామక్రియ చాపుతాళము.

పల్లవి.

దినమెమరణమనితెలియుడి ।

అనుపల్లవి.

సంతతసుఖుజీవికితగులాయగాక - తానెవ్వరోతనవారెవ్వరో॥

చరణములు.

పుట్టిబూరగమానుపూచికాచిలెస్స - పువ్వులుకొమ్మలుకదలగను । తొట్టినగాలికితొడిమిప్రూడిపోతె - చెట్టుతొవకమాటచెప్పిపోయెన ॥దిన॥ నెట్టానఅడవిలొరట్టుగుట్టలనడుమపెట్టెనెవకయీగప్రేమతోను । గట్టిగయీగలుతేనెతాగిపోతతెట్టెతొవకమాటచెప్పిపోయెన॥దిన॥ వత్తితోడనూనెవనరొప్పగబోశి - వత్తికైనజ్యోతివెలిగించగ - వత్తితోనెనూనెవడశిపోవుటెకాని - వత్తితొవకమాటవరుసదెలిపెనా॥దిన॥ గాలికంపదెచ్చి గూడెంటనేబెట్టి గూటిలోపలరెండు గుడ్లుబెట్టి । గుడ్లు అలసిపిల్లలెగశిపొయ్యేవేళ గూటితొవకమాటచెప్పిపోయెన ॥దిన॥ కాలకారణమునకాలుడుగొన్పోగ యీలాగుయేగంటియీశునితో । వాలాయముగనువదిలిపోవుటెకాని ఈలాగుబొందికిమెలుకెగల్పెనా॥దినమె॥

౧౪—రాగం ధన్యాసి అటతాళం.

ప ల్ల వి.

వాశిగయిలలో రేచక పెద్దల దూషించకయుంటె ।

అ ను ప ల్ల వి.

శేషశయనకుసతతము ప్రియముగ సంధ్యసలిపినట్టె ॥

చ ర ణ ము లు.

దోషవుచ్చిపరహింసలు జేయక ఆశపడకయుంటె । దేశములో శబాసనిపొగడిన కాశికిపొయినట్టె ॥వాశి॥ వెసగదప్పికొనివచ్చినవారల కసురుకోకయుంటె వసుధలోపలను వేయుసలింద్రలుపొసగబెట్టినట్టె ॥ వాశి॥ అసులుసుటై యాకలిగొన్నర్థుల కసురుకోకయుంటె । షడ్రసాది బహురాజాన్నంబులుచాలబెట్టినట్టె ॥వాశి॥ భక్తిభావమునబాగుగమనసునబంధించుకయుంటె ॥ ముక్తిమార్గమునపేక్షకుఅతివిరక్తుడైనట్టె ॥ వాశి॥ సతులజూచికనుసైగలుచేయకమతిగలిగియుంటె । వ్రతలుమానిమర్వ్యసనములుడిగి యతీశ్వరుడైనట్టె ॥వాశి॥ సతతముయాగంటీశునిపాదాశ్రితుడై తావుంటె।అతులితముగబహు అనంతభూషణములలంకరించినట్టె ॥వాశి॥

౧౫—వచనము.

వ్రతమేవిధమునఆచరింతురోయేవ్రతమునకుశంభుడుప్రియుడో। వ్రతశబ్దంబునకర్థంబెటువలె వ్రతులునుమాకికదెలుపరయా ॥ మంత్రపిండమేవిధమునఆయును మాంసపిండమేవిధమునగతిబాశను । మంత్రరాజనంకర్థంబెటువలె మంత్రచింతనంబేలాగో।మంత్రంబేరీతినజపియింతురొ మంత్రార్పణఅభవునికెట్లాయనో । మంత్రసిద్ధులైమహిలోవెలసినమాన్యులుమాకికదెలుపరయా ॥ వ్రత ॥ ఇష్టముప్రాణముభావముదెలసిన - హృదయంబెచ్చటబాయకనుండును - అష్టదళకమలంబెక్కడ ఆనందంబేరీతినగలుగునో - అష్టాంగంబులలక్షణములనుసర్వాలింగసంధానత్వంబును - అష్టతనువుగుణములుయెడబాశిన అరుహులుమాకికతెలుపరయా ॥ వ్రత ॥ అక్షరములకుమొదటిఅక్షరం - అరురేకులమంత్రం - మందాహోజ్యోతిస్వరూపం - ఆరారులుమీరినశివతత్త్వంబ

ధికులుమాకిక దెలుపరయా ॥ ప్రత ॥ వేదాంతంబులలోనిరహస్యమువే యురేకుత వెలిగెటిపద్మము - నానుబిందుకళలుండేతావులు నవచక్ర స్థానంబులను-ఆదిత్యానలచంద్రమండలము ఆత్మత్రయమును కుండలి విధమున - భేదంబెరిగిశివైక్యత నొందిన పెద్దలుమాకిక దెలుపరయా ॥ ప్రత ॥ శైవసత్తకంబనగనెటువలెషడుస్థళంబులు అవియెవ్వనంటివి - షడుస్థ నగ అవియేవి - శైవంబులలోనిరహస్యము - సద్వీవేకులై శ్రీ గురుకృపచే - భావసిద్ధులెభువిలో వెలసిన ప్రజ్ఞలుమాకిక దె లుపరయా ॥ ప్రత ॥

౧౬—మేలుకొలుపు.

శివశివ మోసపోతిగా ॥ మోసపోతిసదా శివుని నే మోదమలరగ పూజసేయక ఆశపడియీషణత్రయముల అంటిదిగులుచెసూ ॥ శివశివ మోసపోతిగా ॥ మనసుననుపంచాక్షరనియోతి మంత్రమలవడ లేకజహ్వా కు - ఎనసియేహ్యాళు వగలపలుకుల వ్రతలుబెట్టుచునూ । దినదిన బి లాగుజపపుచడిన్నరసికునాత్మనమ్మక - మునసిమోహావార్ధిలోపల ము నగపాలాయెగా ॥ శివశివ మోసపోతిగా ॥ నిష్ఠతోనీపాదయుగళ్ళము నిర తమునుమదినమ్మనేరక - అష్టపాశములనెరిప్రకృతియు ఆశ చ్చుచు నూ । కష్టపడియీమోహాజీవుడు కాలమానముకొలదిదెలియక - నష్ట మగుశతకాలమెల్లనునడి పంగాగతినా ॥ శివశివ మోసపోతిగా ॥ ముద లుముష్టాప్రాణభావము మోదమునతా దెలియకుండిన - పొదలుసేస్తరి వర్గములుతమవరుసవాయువుకు । విదితముగ యీగంటిరాయుని విభుని యెప్పుడుదలప నేరక - చెదరియీమోహాబ్ధిలోజనియింపపాలాయగా ॥ శివశివ మోసపోతిగా ॥

౧౭—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఇదిగో భవరోగముల కిలనవుషధములు ।
ప్రవిమలంబైన శివభక్తులకునెల్లగా ॥

చరణములు.

శరణునంగముపూర్ణచంద్రోదయమెలింగ - పరివశమెఱనంద

భైరవంబు । చరమూర్తిపదసేవసంజీవనంబున - ద్గుణనాథుకృపయెుజ రాంకుశంబూ ॥ ఇదు ॥ కమనీయరుద్రాక్షకనకసింధూరంబు - అమిత ముగభసిత అగ్నికుమారకంబు । విమలమైనదివ్రతము వీరవిక్రమ రస ము - రమణీయపంచాక్షరియురసభూపతియు ॥ ఇదు ॥ సతతదాసోహ నిశ్చయమెుచింతామణి - అతిశివధ్యానమెుఅభ్రకంబు । మతిలోన గు రునుతియుమందారమేగంటి-పతిశంభుసేవయేపరమామృతంబు॥ ఇదు॥

౧౫—మేలుకొలుపు.

శివశివశరణుశరణూ ॥ శరణుశరణుపురాతనులకుశరణుశైవసు మార్గులకును - శరణునాపవిదూరులకు శివశరణులకునెల్లక ॥ శివశివ॥ మేదరాచన్నయ్యగారికి మల్లికార్జునపండితయ్యకు - నూదరదూడయ్య నుడివలమాచకీమణికీ । పాదతీర్థప్రసాదమందెడు ప్రాణలింగముతా నునుకబై - మోదముతోశివునందుగలసినమవుళిగయ్యకునూ॥శివశివ॥ కిన్నడబ్రహ్మయ్యగారికిఘనుడుకుమ్మరగుండవిభునకు - కిన్నెరబ్రహ్మయ్య గారికికేశరాజుకునూ । పన్నగశివవెంకమంచన పండితయ్యకు వడయ నంబికి - ధన్యుడగు గురుబసవశంకరదాసమయ్యకునూ॥ శివశివశర ॥ పరమశివగురుభక్తవడయలపాదతీర్థప్రసాదమందెడు - పరమశివకవివ గులక్ష్మినుపాదసేవకుడక । అరుదుగఆనందముగబసవయ్యకును దాసో హామార్గము - కరుణనొసగినయట్టియూగంటిగురునకునూ॥ శివశివశర॥

౧౬—రాగం కేదారగౌళ.

పల్లవి.

అనుదినముపరమకళయెుందులీనంబైన ।
ఘనులకేగాకనినుకననొకరివశమా ॥

చరణములు.

సతతనిర్మలబుద్ధిసమరక్తులయుగూడి-హితపరాత్పరము తామేలె గుగిపలెనూ । ఇతరమంతటమెులగిఇష్టలింగముజేర - గతిత్రోవనావం టికర్తికగుపడునా ॥ అను ॥ సకలభువనములందుసంచారియైమనసు - వికసించిపశ్చిమవీధిచొరదు।సుఖదుఃఖములబొందిసొలసియుండుటెకాని అకలంకభక్తినాకలవియేదానా ॥ అను ॥ హరిషించిపంచేంద్రియూస

_ర్తిచేబొరలి - మరుకేళిత్రిగుణములుమరచియిపుడు। గురుధ్యానయోగం టిగురు జేరకయున్న - మరిపలుకుఓంకారగురుజేరగలనా॥అనుదినము॥

౨౦—రాగం - కేదారగౌళ.

పల్లవి.

బీజమిడివృక్షంబుపెంపుచేసినయెట్లు।
తాజేయుసుఖఫలముతాననుభవించుగా ॥

చరణములు.

సతులందు శుక్లంబు సంయుక్తమైనపుడె - కితకర్మఫలమజుడు కెరలిరాసెగా। మతముగానకజీవిమగ్నుడై చెడిపేహి - సతతంబుకలిమికినిచాలచింతించుగా ॥ బీజ ॥ హేతుగతకారణముహీనమైతనలోన-భూతాదిపంచకముబుద్ధిచదర। భ్రాంతిపడిపరధనభ్రాంతిప్రపంచునకు - పతీయునాగురుడుయొసగుసౌఖ్యములూ ॥ బీజ ॥ నీతిమార్గమునడడునీరజాసనుకైన - వాటమగుస్వర్గంబువచ్చుపోవు। పాటించిహృదయాబ్జపంక్తులనువిహరించు - నాటకుడుయాగంటినాథుగనుమనసా ॥ బీజ ॥

౨౧—రాగం-కేదారగౌళ.

పల్లవి.

ఇదినమ్మరాదుమనమెన్నటికినీ। పదిలంబుగాదు యీంపాటకిఫుకొంప ॥

చరణములు.

ఎనసిక్రీడించేటి ఎముకలెవాసాలు - ఎనుగొన్ననరములె పెండెకట్లు। పైనున్నచర్మంబుపైకప్పడంబిదియు-మోనసికట్టిన మలమూత్రములకొంపా ॥ ఇది ॥ వాకిండ్లులొమ్మిది నమసతోదీనికి - ఆకండ్లుద ప్పలు అనుదినంబు। మూకలైకొలిశేటి ముచ్చులేడ్గురుసుమ్మి - చేకొన్నజీవికిచసాలకొంపా ॥ ఇది ॥ సారంబులేనిసంసారమొసంకిళ్లు - భారంపుకర్మమెపైకావలి। ఈరీతియాగంటి యీశుగానగలేక కేరకనుతిరిగేటిసిద్ధాలికొంపా ॥ ఇదినమ్మరాదుమనమెన్నటికినీ ॥

౨౨—రాగం కేదారగౌళ.

పల్లవి.

అనుదినముపరమకళయైవిశ్వమంతయును।

కను తేజయిష్టలింగము తానెకాదా ॥

చ ర ణ ము లు.

కలితచిన్మయమగుచుకమలంబునందుని - ర్మలసోమసూర్యాగ్ని మండలమునర్గా । అలరుతత్త్వపరమాణుసూక్ష్మద్వార - జనితజగము లకుప్రకాశంబుతానెకాదా ॥అను॥ అదెకదనీలతోయదమధ్యమనెడిక ళ - అదియువిద్యుల్లేఖయనగబరగుగా ।అదియునీవారశూకాదిసూక్ష్మం బగుట - ఉదితమాహాజ్యోతి ఓంకారమనగన్ ॥అను॥ తలపోశిశ్రుతివి శ్వతఃశ్చక్షుబుతియనుట-గలుగువిశ్వంబెల్ల కన్నులనగా । వెలుగులం దులలోనవెలిప్రకాశంబైన కలితమేగంటి గురుకరుణకళ తానెకాదా ॥

౨౩.—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

అనితెలియగము క్తిశ్రేష్టుడగును।పదియారుకూటములుబరగినట్లుండుగా॥

చ ర ణ ము లు.

ఆధారమగుమూలమాదిత్యవర్ణమై-వేదసంఖ్యలతోడ వెలయు నొకపద్మం । పాదుకొనినందులో పవనాఖ్యుడుదయించి - మీదనొక భ్రమరంబునాదరసమీనెగా ॥అది॥ లింగదేహమునందు బంగారువర్ణ మై - పొంగుచునుఆరింటపువ్వుగలిగుండుగా । రంగుగనందులో చంగ ల్వకోలనుండు - ఇంగితంబుగహంసచెంగుననటించుగా ॥అది॥ మాణిక్య కాంతిచే మణిపూరకమునందు - పూనిపదిరేకుల పువ్వుగలిగుండుగా । కానలములోనొక్క కప్పకాకినిత్రిమింగె - మీనములురెండెగసి భానుని హరించెగా ॥అది॥ పిండాండదేశమున బ్రహ్మాండపురముండు-దండిగపం డ్రెండుపూవులతోడగా । అండజేరుకఅచటనిండుతేజంబుండు - పం డువెన్నెలబైటకుండలినటించుగా ॥అది॥ గంహ్వారంబైనట్టి జిహ్వాగ్రదే శమున - ముమ్మూలకోనలోయిమ్ముగలదు । హమ్ముకొనిపదహారు తమ్మి రేకులమీద - ఘుంమనుచువకయింతి సమ్మతినటించుగా ॥అది॥ జోడు కొండలనడుమమూడుత్రోవలుగలవు - జాడదెలశితెనొక్క మేడగల దు । నాడచూడగనచటమూడువకటయ్యెను - నీడగనివకకోటిమూ డునుహరించెగా ॥అది॥ పాలసాగరములోపరిశిమేడయుగలదు - చాలు

వెయు స్తంభాలచవికెలోపలనూ । కోలాహాలంబైన కోదమసింహము గలదు - మేలుయేగంటిగురుమూలమెరిగించెా ॥అది॥

౨౪—రాగము కేదారగౌళ.

పల్లవి.

ఇదియుఖేచరిముద్ర ఇదినిత్యమగును ।
వదిలముగసాధించ బ్రహ్మాంబెయూను ॥

చరణములు.

చూపునిలచినయపుడె రూపంబుగనుపించు - చూపురూపాకైటె తెాపగనుపించుణా । పాపమధ్యమునందు పరంజ్యోతిరూపమై - దీపంబు నుపించుదివ్యపురుషులకూ ॥ఇది॥ అయినమగుచిత్తంబులయము జేసినయపుడె - బయిలులేనట్టినిర్బయిలుగనుపించుణా । బయలులోపల వున్నప్రణవంబురంజిల్లు - వేయురేకులకమలవీధిగనుపించుణా ॥ఇది॥ సత్తుయనియెాటివత్తిసరసత్వముగజేసి-చిత్తమనెసమురుచేవత్తిముట్టించి। చిత్తమలినముబాపు శ్రీగురునికృపగాను - ప్రత్యేకమేగంటిపతిగానుపించుణా ॥ఇదియు॥

౨౫—రాగము కేదారగౌళ.

పల్లవి.

ఏటికేలముప్రతముఏటిసుఖము।మాటనిజముగజిహ్వామరియుండవలదా।

చరణములు.

అవిరళంబుగపరిపాకవర్జితమైన - వివరింపబొంకుమరివిడువవలదా । భవిచూడరాదనుచుభావమందున్నట్లు - నవిశేషమునపరసతిరుండవలదా ॥ఏటి॥ ఎదటియవగుణములకుయేహ్యాబుట్టినయట్లు - మదికోర్కెలుడిగినెమ్మదినుండవలదా । కొదదీరరతికెళికొల్లలాడినయట్లు - కదసిలింగముమీాదకనుగొనగవలదా ॥ఏటి॥ రోసిమలమూత్రములరోతబుట్టినయట్లు - ఆశపరద్రవ్యములఅట్లుండవలదా । కానుమీాదనువాంఛకలిగినాయాగంటి - యీాశుమీాదనుధ్యానమిపుడుండవలదా ॥ఏటి॥

౨౮—మేలుకొలుపు.

హరహర తేరుఇదుగో॥ తేరుయిదుగో ప్రకటముగ తన దివ్యహృద యమునందు ద్వాదశ। నీరజంబున మోగుప్రణవమునిండియుండగను॥ హర॥ అలరుతనునను తేరుయెందు ఆరుచక్రములందుయిరుసాక - బలి మిగలకుండలియుమీదను పాదుకొనియడిని। నిలచియెబ్బది రెండువేలా నిగమనాడులసంతనంబది - చెలువమమరుగప్రాణవాయువుజీనసూత్ర మునూ ॥హర॥ పట్టువిడుపులయెందుయింద్రుడు పరగిమనసున వుండు చంద్రుడు - నెట్టుకొనికన్నులనుసూర్యుడు నెళవుమీగనూ। మింటి వాయువుబ్రహ్మగమనముమీన కేతనుతండ్రిగలడట - ఇట్టిదేవతలుండు స్థళములుయిదిగో దెలియగను ॥హర॥ చెవులుశ్రోత్రముచేతనంబులుచ తుమధ్యసుషుమ్నాళము - రవియుమించినస్ఫటికవర్ణము రంగమంట పము। స్తవముచేయనువశముగాదిది చాలయూర్ధ్వమండలంబుల- భవుడుయాగంటీశుమెలగే భావపుష్పకమూ ॥హరహర తేరుఇదుగో॥

౨౯—రాగం ముఖారి-ఆటతాళం.

పల్లవి.

అరయగపూర్వాచార్యులునడచిన అదియెమతముమాకు।

అనుపల్లవి.

గరిమెతోగురుడొసగిన శివదీక్షకారణంబుమాకు॥

చరణములు.

దేవులకెల్లను దేవగుపార్వతి దేవితల్లిమాకు। కావునమహేశ్వ రుడగురుద్రుడుకన్నతండ్రిమాకు॥ అర॥ నిరతముభూతిత్రిపుండ్రము దాల్చుటనీమకంబుమాకు। పురహరునేత్రోద్భవరుద్రాక్షలుభూషణం బుమాకు॥ అర॥ ప్రతిదినమునుశివతత్వవిచారముపరమార్థముమాకు। ప్రవిమలషడ్విధస్తుద్రవ్యముభావార్పణమాకు॥ అర॥ అవిరళలింగని వేదితద్రవ్యముఅతిశయమునుమాకు-కువలయముగ యాగంటీశ్వరుడు గురుదేవుడుమాకు॥ అరయగ॥

గురువైన యాగంటి లక్ష్మప్పగారు శిష్యులైన చిట్టప్పగారు అరిట్యాకొండ గృహాకు తపస్సుకు వెళ్లగ వకనాడు భోజనకాలమందున వీరి మనోనిశ్చయము కనవలెనని యాగంటి ఈశ్వరుఁడు వ్యాఘ్ర రూపముగ వచ్చియున్న సమయంబున లక్ష్మప్పగారు కనురెప్ప చలించి తావు విడిచి వెళ్లగ శిష్యులైన చిట్టప్పగారు పరాకు దెలుపుట.

౨౮—రాగం కేదారగౌళ.

పల్లవి.

అదియేమిగురుడనీవట్లవురికెదవు ।
తెరవునదిపులిగాదు దేవుడితడనుమీ ॥

చరణములు.

స్నానసంధ్యయునిష్ఠనీ౦బులేమాయ - పాయకనునీలోనుపలుకులేమాయెగా । మాయకట్టైనునమ్మిమనసులోతెగలేక - అతడువచ్చినయపుడెట్లట్లవురికెదవూ ॥ అది ॥ మొదటిమాటేమాయమూలంబులేమాయ - సదమలక్రియలన్నిజాడలేనూయెగా । చదివినందుకుమూడులక్షలయాభై వేలు - గ్రంథములుయిలలోనుకొదవుందిగురుడా ॥అది॥ అంగశుద్ధేమాయలింగశుద్ధేమాయ - అంగజపమేమాయలింగమేమాయెగా । అంగజుడుయాగంటిలయ్యవచ్చినయపుడె - అంగకట్టైననమ్మి అట్లవురికెదవు ॥అదియేమిగురుడనీవట్లవురికెదవు॥

౨౯—రాగము పూరికల్యాణి అటతాళము.

పల్లవి.

నేనుపోతానాకుసెల్వీమ్మి-ఓలక్ష్మప్ప-నేనుపోతానాకుసెల్వీమ్మి॥

చరణములు.

మట్టిలో సెల్వలేకగట్టిజేసుకొనినీవు - అట్టెసెల్వలేకనీవుపారిపోతివి । గట్టిగనీప్రాప్తిల్లుఘనమోహములచేత - చట్టవిడచేకాలమాయ యేమిచేతుగురుడ ॥నేను॥ గట్టిగనీప్రాప్తిల్లుఘనమాయమూడులక్షల - ఏభై వేలగ్రంథములుకొదువవున్నవి । ఎల్లనీవుఅల్లజెప్పిఆధారమైయ్యుంటె - మళ్లినచ్చినిన్నుకొంచపోతానుగురుడా ॥నేను॥ రూపములోరూప

మైయ్యెత్రదూపమయ్యెతానువచ్చి - రూపములోపలివలెవచ్చితాను।
రూపములోయాగంటిపతిరూఢినందీశు - ఏవుమీరిన్నుకొంచపోతా
నుగురుడ ॥నేనుపోతానాకుసెల్వీమ్మి॥

గురువైన లక్ష్మప్పగారు పలుకుట వచనం.

౩౦—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఏడవున్నావనుచుఎతుకుదురచిట్ట । మాయలోపడవేరిపోతివిరకొడకా॥

చరణములు.

వట్టిసంధ్యలువార్చివర్లివర్లుచునేను - దిట్టమనెగురునాథుదృష్టిగి
నసైతిరా । అట్టెఓంకారమనెఐదింటిలోదిరిగి - దిటముదప్పినకుక్కచం
దమాయబ్రతుకూ ॥ఏడ॥ మూడుసంధ్యలువార్చిమునిగినేపోతినే - వక
సంధ్యవార్చితావైవుగపోయెరా । మతితెలసిసుజ్ఞానమండలాపతికలసి -
హితవుదప్పితిరిగేటివెతలునాకేలే ॥ఏడ॥ అష్టదళమునలేదు ఆకారమున
లేదు - త్రికూటమార్గమునలేదుదివ్యమునలేదు । చపలముగకనురెప్ప
సోకినప్పుడెనీవు - ఉపముగయాగంటిపతిజూడలేద ॥ఏడ॥

యాగంటిలక్ష్మప్పగారిచెల్లెలు చెప్పినది.

౩౧—రాగం ముఖారి అటతాళం.

పల్లవి.

ఓరిపంచబాణనిన్ను వులికిపాలుజేసినా-నిన్నగ్నిపాలుజేసినా ।

అనుపల్లవి.

నాటశివుడునాకుప్రాణనాథుడౌటయెఱుగవా ॥

చరణములు.

చిగురుటెల్లుచెరుకుటెల్లువువ్వుటంబులువెయ్యగా । భోగినీకువెఱ
చుగానిశివయోగినీకువెఱచునా ॥ఓరి॥ అంగసంగనిన్నుజూచిఅల్కుచుం
దునుమన్మథ । లింగసంగినిన్నుజూచిలెక్కచేయవచ్చునా ॥ఓరి॥ స్వామి
సద్గురుమూర్తియాగంటిరాయునికొల్వగ । వేయుమాటలేలనీకుపలజూ
హువచ్చున ॥ఓరిపంచబాణ॥

—*(బనగానపల్లె - పూదోట వీరప్పయ్యగారి శిష్యులు)*—
లింగావధూతగారుజెప్పిన కీర్తనలు.

3౨—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

అమితముగపూతోటనాత్మరామునిపదము।
విమలభక్తినిపూజవెలయజేసితినీ॥

చ ర ణ ము లు.

జనియించిఅవుకులోసంచరింపుచునంత - బనగానెపల్లెలోపల భక్తిమెరతుఁ । చనివీరక్షేత్రమునసద్గురునిగనిమ్రొక్కి - గుణరహితననుముక్తికృపసేయమంటిఁ ॥ అమిత ॥ గోవునిడచినయట్టి కుబ్జవరలినరీతి - అవనిపతినెడబాసి అలపరచగ । వివరించి నామొరవినితీవ్రముగవచ్చి - శివయోగినన్ను కృపజేసిరక్షించెఁ ॥ అమిత ॥ హరుడు తనకునుదివ్యఅభయహస్తంబిచ్చె - గురుడు తీర్థాదులును కృపజేయుచుఁ । విటివైనపూదోటవిభుడుమోక్షముతనకు - కరతలామలకముగకరుణించినాడు ॥ అమితమగుపూతోట॥

33—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

అమితమగుశివయోగమభ్యసించియునేను।
అమనస్కమైబైట ఆటలాడుదును॥

చ ర ణ ము లు.

అక్కైహంసలమీాటి అబ్దిమధ్యంబునను - గట్టిగస్వర్ణమగుకమలాంతమునను । పట్టైనఓంకారప్రణవాక్షరమునతా - ద్రష్టనైగూర్చినే తేజరిల్లితిని ॥ అమిత ॥ సోమసూర్యులమించిసొంపుమెరయుచునెపుడు - సామగానముచేసిసంతోషమునను । ఆముకొనిసర్వమునునట్టినిగమాంతమున - హేమద్వయంబగుచుయేనువెలగుదును ॥ అమిత ॥ మితిలేనిఅర్కులునుమెరసికూడినయట్లు- ప్రతిదినములోబైటప్రబలుచుండుఁ । అతితుర్యమగుతోట నాత్మరామునిగలసి - సతతమునునిర్భైటసంచరింపుదును॥ అమితమగుశివయోగమభ్యసించియునేను॥

## ౩౪—రాగం కేదారగౌళ.

పల్లవి.

నేనెనన్నియుగాక నెరనిరామయుడనై ।
నేనెనిరాలంబ నిజవస్తువగుదు ॥

చరణములు.

జగములనునిర్మింతుసంపూర్ణముగ నేను - జగములకువెలిలోన చాలప్రబలుదును । జగములకుదూరమైసర్వసాక్షినిగుచు - జగములునునాశూన్యజఠరమున వెలుగగ ॥ నేనె ॥ ఒనర నేనున్నతావునమహాగూఢమగు - కనలేరుసురులుమునులుత్రిమూర్తులును । వినుడిశృతిశాస్త్రములవిమలగాయత్రినా - ఘనసస్వరూపంబుకనికానలేరు ॥ నేనె॥ పరమసాకారతత్వదమనెమిగిలితుద - కరతలామలకముగకనుపడుదునెపుడగ । నరయనిర్లేపులకునిజభక్తవరులకును - పరికించపూదోటపై ప్రకాశింతుగ ॥ నేనెనన్నియు ॥

## ౩౫—రాగంకేదారగౌళ.

పల్లవి.

నిజగురునికృపనునేనిశ్చలానందమున ।
సుజనవృత్తినిబైటసాంపుమెరయుదును ॥

చరణములు.

చుట్టితలక్రిందైనసూక్ష్మకుండలిరేచి - పట్టిబిందునువివికిశారజిమ్ముచును । అట్టినయనాగ్రమునఅగ్నినేత్రముదెరసి - గట్టిగసర్వమునుగాల్చిమెరయుదును ॥ నిజ ॥ తలచిచూడగబైటతరుచుమెరుపులతోడ - బలసిశతకోటిరవిప్రభలవెలుగుచును । అలరునాషోజ్యోతి అంతరంగమునందు - నిలచిసుజ్యోతిమైనిండివెలగుదును ॥ నిజ ॥ అరయశాంభవితుదనునతిసూక్ష్మపదమగుచు - నిరతమునుసద్గురుడునిండి మెరయగను । లరుచైనపూదోటధర్మాత్మునంటినే - నరయలోవెలిమరచినతితుర్యమగుదుగ ॥ నిజగురుని ॥

౩౬—రాగం కేదారగౌళ.

పల్లవి.

మృత్యువునుదరిమియర్మిలిమూలకందమున ।
నిత్యశాంతుడనగుచునేనెవెలుగుదును ॥

చరణములు.

పరమహంసనై నేనుపరమాణుముఖముననను - నరుడుగజన్మించి యమృతకరమగుదున్ । మరియునాపోజ్యోతిమధ్యనద్భుతముగ - పరమమృతజ్యోతినై ప్రజ్వరిల్లుదును ॥ మృత్యు ॥ త్రివిధశృంగములకడది నకరుణిమధ్యమున - వినరించసహస్రదళవిశదగృహముననను । సువర్ణ మెరుపులదివ్యజ్యోతిపుంజముతుదను శివరూపమైనేనుచెలగిక్రీడింతున్॥ మృత్యు ॥ సగుణనిర్గుణంమగుచుసర్వభూతములలో- సుగుణవృత్తినినేను చొచ్చివెలుగుచును - నిగమగోచరమగుచునిలచిదీపించుచును - అగణితంబగుతోటనాత్మరాముడనై ॥ మృత్యు ॥

౩౭—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఉన్మనిలోనిలచిఓంకారరహితమై ।
తన్మయానందమునతానెనిజమగుదున్ ॥

చరణములు.

అందిబంధించియును అనిలుపరమటజొచ్చి - పొందించిప్రణవమునబిందుసమగూర్చి । చందపుచిదాగ్నిచే చేతన్యములుజెరచి । బిందుమధ్యనుచిదాబింబమైమెరతున్ ॥ఉన్మ॥ దృష్టితుదనిలచితనుదినకరునిగలిప్రబలి.- అష్టప్రకృతులుజొచ్చిఅంటిమెరయుదును । ద్రష్టనై సహస్రదళపద్మముననేనెపుడు - ఇష్టలింగముయగుచు యేనువెలగుదును ॥ఉన్మ॥ అజపాక్షరనిమొదలు గానంతవేదములు - భజియింపరానట్టిపరమాత్మయగుచున్ । విజయమైపూదోటవిభునిరూపై నేను - అజపదంబై తానుఅతితుర్యమగుదున్ ॥ఉన్మనిలోనిలచి॥

౩౮—రాగం కేదారగౌళ.

పల్లవి.

కలసిసర్వేంద్రియములకలియకనుసుజనులును ।
నిలచికైవల్యముననిండివెలుగుదురు ॥

చరణములు.

తలచగురుపుత్రులునుధరణిపైజన్మించి - కులగోత్రములుగలిగి కులరహితులగుచుఁ । వెలయుస్థూలాంగమునవిజ్ఞానపురుషులల - జలధిలోరవియుఅంటెంటనట్లుఁ ॥కల॥ కుజనసంసారులలోకూడివర్తింపుచును - సుజనసంసారులైసొంపుమెరయుచును ।.నిజస్థానమునవారు నిలచినిర్వాణులై - అజపదంబైబైటనంటివెలుగుదురు ॥కల॥ గురునికరవీర్యముననరుడుగనయోనిలో - ధరబుట్టినీసుతులుశరజనేత్రులునై । సురచిరంబగుతోటసుగుణరామునిగలసి - పరమపదమునయెపుడుబలసి ప్రబలుదురు ॥కల॥

౩౯—రాగం కేదారగౌళ.

పల్లవి.

పట్టైనపూదోటపరమాత్మకృపనునే ।
కొట్టికర్మలతుదనుగోచరింపుదును ॥

చరణములు.

విజ్ఞాననేత్రంబువిదితముగదెరచియును - అగ్నిముఖమునగాల్చి ఆనందముననను । సుజ్ఞానమైనట్టిజ్యోతిస్వరూపమై - ప్రజ్ఞతోసహస్రదళపద్మమునమెరతుఁ ॥పట్టై॥ అష్టదిక్కులుపృథివి అంబరముఆముకొని - ద్రష్టగుచులోబైటతరలకనుప్రబలుఁ । ఇష్టమగువేదాంత యేకాక్షరుండనై - నిష్ఠతోఅమృతపదనియతమైయుండుఁ ॥పట్టై॥ సుగుణమైయున్నట్టిసుజ్ఞానకరముపై - సగుణనిర్గుణమైనసద్గురునిగనుచుఁ । అగణితంబగుతోటనాత్మరామునిగలసి - నిగమగోచరమగుచు నిండివెలుగుదును ॥పట్టైనపూదోట॥

౪౦—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

ఇన్నిభ్రాంతులదిరుగు ఇలమీదజ్ఞానులకు ।
ఎన్నివిధములమోక్షమేలసిద్ధించు ॥

చ ర ణ ము లు.

చెరువుకుంటలఆశ క్షేత్రములపైయాశ - గురుతువనములఆశ కూపములఆశ । వరదేవళములాశవసుధవేల్పులఆశ - సురపూజనములాశశుచినిపైఆశ ॥ఇన్ని॥ బలిమిరాజ్యములాశపరసతులపైఆశ - చలనచుట్టములాశపడ్పుచులఆశ । మెలగుచేలములాశమెరుగుసొమ్ములఆశ- మలినకులములఆశమాయపైఆశ ॥ ఇన్ని ॥ ఎనయుస్నేహములాశయిల్లాలిపైఆశ - ఘనసుతులపైయాశకలిమిపైఆశ । జననిజనకులఆశజనభోగములఆశ - ధనధాన్యములఆశతనువుపైఆశ ॥ఇన్ని॥ ఉపవాసములఆశఉపనయనములఆశ - నిపుణయజ్ఞములాశనిధినదులఆశ । జపతపంబులఆశ మన్మతంబులఆశ - కపటశాస్త్రములాశ ఘనశృతులఆశ ॥ ఇన్ని॥ తనరయోగములాశధ్యానధారణలాశ - మునివేషములఆశ ముక్తిపైఆశ । వనరపూదోట కేవలశూన్యమునగూడి - మనసు తన్మయముజెందినఆశలణుగుగ ॥ఇన్నిభ్రాంతులదిరుగు॥

౪౧—రాగం భైరవి ఆటతాళం.

ప ల్ల వి.

పలువలైగురువంచనలుచేయుక్రూరులనుయిలపైననిలబెట్టిరామ ।

అ ను ప ల్ల వి.

చిలుకుటంబులువేశిచించిమేనులుచాల చీకాకుజేతురోరామ ॥

చ ర ణ ము లు.

బలుక్రొవ్విగురుసుతులపరిహాసకముజేయుభ్రష్టులనుమహిలోనురామ । చలముచేబంధించి చనువెంటచరులలొ చావుడనిద్రోతురోరామ ॥పలు॥ స్వామిద్రోహులబట్టి జర్జరిభూతముల యమభటులుమొత్తుదురురామ । సామజంబులచేతనలియద్రొక్కించినను చచ్చిచావనిజెడులు రామ ॥పలు॥ తామసులకుదయించితరుచుయాతనలందుదయలేక

ద్రోతురో రామ । ఏమిజెప్పుదునయ్య యిట్టిజీవులదుఃఖ యీశపరమేశ వ్రూరామ ॥పలు॥ కులగర్వులై దేశకునిమీదకోపించిగుడ్లెఱ్ఱజేసిననురా మ।పలువరించక నేత్రములుగోరుగండ్లచేపట్టివెగరింతురోరామ ॥ పలు॥ కెఱలిముక్కును చెవులుకీచిపారగకోశికిలకిలనునగుమనుచురామ । మొరలుబెట్టగగోశిమురికిభక్షించుడనిముసలముల మొత్తుదురురామ ॥పలు॥ తులువలును పెద్దలనుదూషించెజనులను జిహ్వాముడుగోయించురామ । ప్రళయమునకైనయీపాపాత్ములకుసుఖముప్రాప్తించదయ్యావ్రూరామ ॥ పలు॥ నీపదాబ్జములుమదినెరనమ్మియున్నట్టి నిజభక్తవరులకునురామ । ఆపదలులేకచిదానందులై యెపుడుఅమృతులై యుందురోరామ ॥పలు॥ పరికించిశిశుహత్యబ్రహ్మహత్యగోహత్య మరియుస్త్రీహత్యలకురామ । ధరపైనప్రాయశ్చిత్తముగలదుయని శృతులు మొరసినాటింతురోరామ ॥ప లు॥ గురునినరుడనిజూచిగురునిపై ద్వేషించికుజనులకుమీరెగతిరామ । అరయప్రాయశ్చిత్తమవనిపై లేదయ్యాస్థిరమైనవూదోటరామ ॥పలు॥

## ౪౨—రాగము నాదనామక్రియ - అటతాళం.

### ప ల్ల వి.

౦ దరిజేర్చుకడతేర్చుధాతవై తివిమాకు భీతులేటికియెఓరామా ।

### అ ను ప ల్ల వి.

ఊతనేర్పినవీరగురుడుమాతలిదండ్రి-నూతనముజేసెనోరామా॥

### చ ర ణ ము లు.

తండ్రిగర్భములోనుదాహామాహారమై - తగిలుంటికొన్నాళ్లురా మా । మాతృగర్భముజొచ్చిమన్న మొదలుగ బీజమాయగా కొన్నాళ్లు రామా ॥ దరి ॥ చిప్పలోముత్యంబు చినుకువలెకొన్నాళ్లు చిక్కుబడినే నుంటిరామా । మలమూత్రములగుంటమాయనేగయిలోను మాతల్లి గర్భమునరామా ॥ దరి ॥ తల్లిగర్భములోనుతగుతొమ్మిదినెలలు దాహా మేమెరుగనోరామా । మురికిగర్భములోనుముద్దయైకొన్నాళ్లు - ము నిగితేలుచునుంటిరామా ॥ దరి ॥ తల్లిగర్భమువెడలిధరణిలోకొన్నాళ్లు తపసినై నేనుంటిరామా । తెక్కలిరిగినపక్షివలెనేనుకొన్నాళ్లుదుఃఖమే మెరుగనోరామా ॥ దరి ॥ పాలువెన్నలుద్రాగిపారాడెనాడువృథాప్రా

యముసకొన్నాళ్లు రామా। మలములో బొరలుచును మరికొన్నిదినములు మర్యాసనే నెరుగ రామా ॥ దరి॥ పదునైదుయేండ్లనై పలువనై నేబహు తులువనైనేనుంటి రామా - అదుగో ముప్పదియేండ్లు వంటి భామలతగిలి శుంఠనై నేనుంటి రామా ॥ దరి ॥ వన్నె వాసియు లేక వసుధలో కొన్నాళ్లు మసలనబడియుంటి రామా - మసయనే సంసారమత్తుండనై నేను హింస తెలియకపోతి రామా ॥ దరి ॥ హింసలో యీవృపము యీసారి దొరికె మరిహింసచేజిక్కితిని రామా - తలిదండ్రులెందరో దెలుపతరముగాదు తారకము యెఱుగనో రామా ॥ దరి ॥ వారసేయక వీరగురుడు మాతలి దండ్రి నూతనము జేసెనో రామా ॥దరిజేర్పు॥

౪౩—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఘనకోవెలస్వరము కాకులకుగానట్లు ।
చనటులకు సుజనాళి శబ్దములు చొరవు ॥

చరణములు.

గర్వించి కర్మటులు ఘనులమని చెలగుచును - పరికించ మహిలోన పలువలగుచున్ । పరమయోగులచూచి పలుమాటలాడుచును - సార దిసూకరముగతి సొంపుమెరయుచునూ ॥ ఘన ॥ కలకాలమును విషయ కాంక్షలను దిరుగుచును - చెలగి విత్తాపేక్ష చెయిజాపుచున్। లలనయోనికి నెపుడు లలితముగ నాసించి - మలినులై యమపురికి మరలిపోవుదురు॥ ఘన ॥ పట్టిసర్వేంద్రియముల బంధించనేరకను - పట్టుబడి సంసారభ్రాంతులను చిక్కి । గుట్టైనపూదోటగురుమూర్తి దెలియకను - మిట్టిమృత్యువు చేత మిడిసిపోవుదురు॥ఘనకోవెల॥

౪౪—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఎంతచిత్రితమోయిది ఎనసిచూడగమదిని ।
సంతముగురుమూర్తి సదయుడై వెలుగున్ ॥

చరణములు.

పడియున్న కుండలిని పవనమును నెగయించి - కుడియెడమ బంధిం

చిగూర్చిననిలుచే । నడిమివాకిలిదెరచినడచిపశ్చిమవీధి-గడచితూర్పున పరునికదసిచూడగనూ ॥ ఎంత ॥ సత్తువర్ణముకళలుసర్వమునుఆము కొని- మొత్తముగముమ్మూలమొనసిప్రబలగనూ । చిత్తపీఠముమధ్య చిక్కిరణములతోడ-హత్తిపరంజ్యోతియైయమితమైనుండుర్ ॥ ఎంత ॥ అకలంకమైనట్టిఅద్భుతజ్యోతిపై-సకలాత్ముడై గురుడుసంచరించగనూ । ప్రకటముగపూదోటపరమాత్మునంటినే- సుఖయగుచుఆనందపొంపుమెరయుచునూ ॥ ఎంతచిత్రిత ॥

౪౫—రాగం కేదారగౌళ.

పల్లవి.

అరయశునకములకు ఆజ్యమిందనియట్లు ।
గురువాక్యములుదుర్మార్గులకుహితవెట్లు ॥

చరణములు.

మరిమనోచలనములమాయయోనులనెపుడు - తిరిగిజీవులుప్రకృతిదేహవాసనలర్ । అరసికర్మములబడిఅంధులై దిరుగుచును- గురుసుతులమహిమతముకోరితెలియకనూ॥ అర॥ బలిమిచేకాలసర్పముచేత కాటుపడి- తెలివైనతనపూర్వదేహంబుమరచి। సొలశిజాగ్రస్వప్నసుషుప్తులనుదిరుగుచును - పలువరింపుచుకర్మపాశబద్ధులునై ॥అర॥ గ్రామసూకరముగతిగర్వించిదిరుగుచును-యేమరకపాపములు యెపుడుచేయుచునూ । కోమలంబగుతోటగురునిగూడకగద- పామరంబునయముని బారిపడిమెదరూ ॥ అరయ ॥

౪౬—రాగం - కేదారగౌళ.

పల్లవి.

గాలినెగసినవాగుడుగతినిదిరుగుచజనులు ।
మూలమెరుగకయోనిముఖములనుదిరుగుర్.॥

చరణములు.

చెడిజీవిపూర్వవాశితజన్మమునుమరచి- చెడురూపమగుప్రకృతిజన్మమగుచుర్ । కడలేనిసంసారకారడవిలోచిక్కి--వెడలినిజగురునెరిగివెలయుటెట్లగును ॥గాలి॥ పంచమహాపాతకముపరికించిజేయుచును-ఎం

చిపరవిత్తములహితవుకోరుచునూ । కొంచమగుదుర్జనుల కూడిచౌర్యం పుచును వంచించిపరసతులవడసిపట్టుచును ॥ గాలి ॥ తలచిసుజ్ఞానులను దయలేక తిట్టుచును- కలకలనగివారిగాసిపెట్టుచునూ । బలిమైనపూదోటప్రభువనంటకగదా-మలినులైయిలలోనుమడిసిపోవుదురూ॥గాలి॥

౪౭—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఏమిజేతునుధరలోహీనమనుజులబ్రతుకు ।
క్షేమమునసద్గురునిచేరుటెట్లగునూ ॥

చరణములు.

కామవ్యసనములధరకరుగుచునుపురుషులును - పామరతసతుల వెంబడితిరుగుచున్ । కోమలాంగులముఖముకోరికముజూచినను- ప్రేమమయమగుగురునిమొరగుటెట్లగునూ ॥ఏమి॥ మదముతోసతులమల మూత్రద్వారముదూరి-తుదమొదులెరుంగకింతులచేతనగుచున్ । అధికమోహమునసతినధరపానముజేయ - పదిలుడై తానమృతపానియగుటెట్లున్ ॥ఏమి॥ దుర్మదంబులమరుసిచూపులచలాత్ములై - కర్మమతులై సతులగవసిరతిచేయన్ । ధర్మమగుపూదోటధాతనంటకజనులు - నిర్మలానందముననిలచుటెట్లగునూ॥ఏమి॥

౪౮—రాగం కేదారగౌళ.

పల్లవి.

హితవుజెప్పెదమనసయెఱుగవెనీలోన ॥
అతితుర్యమణులింగమంచునివ్వగలనే ॥

చరణములు.

మరియునాశివకరముమధ్యనిజగురుపదము - గురిమీరినామనసుకూడుండమనినన్ । పరిపరివిధములనుపరువులెత్తిసబ్రహ్మ- మొసపనెటిచౌకుననుమెదిపెదనునిన్ను ॥హిత॥ ఎన్నిజెప్పిననీవుయెఱుకమసపెరుగకను-కన్నుగానకనీవుఅన్నిటరిగెడవూ । యిన్నాళ్లవలెగాదుయిపుడురాముని సెలవు-నిన్నుగునపులినోటనేడువేసెదనూ ॥హిత॥ అష్టపాశముల నేబంధాములిడిపించి - దుష్టాత్ములకునీవుపొలగవేమనసా । యిష్టమెరిగి

తీవ్రమెరుపులనాత్మజ్యోతియుత్రికూటగిరిపై ఉదయమాయెను - శ్రవణ తోనిర్వయిటచిదాభాస్కరుడుప్రబలెన్ ॥గురుపతీ॥ కుసుమస్వాధులు కదసితుమ్మెదగుంపులునుపూదేనెగ్రోలెను - పశిడిఘంటలచిలుకలునుష ట్ఫలములకుమెగశేన్ । మసలుచునుమరియష్టగజములుమేరుశిలతుదగిరికివురికెను - పొసగసాగసులుయిచ్చిమయూరముపొదలియాడగనూ॥ గురుపతీ॥ కలయకాలంబెరిగివిప్రులుకాశిలోస్నానములుజేయుచు - తెలివిభూతియునిండుమెరుపులదివ్యశేలములన్ । నిలచికర్ణికపీఠమధ్యను నిండివెలిగెడులింగమూర్తికి - చెలగిభక్తులునాత్మపూజలుచేయవచ్చెదరూ ॥గురుపతీ॥ అరసిచిత్కళలంటగూర్చిననంతముఖములజ్యోతిబైటను - పరమగురుపూదోటరాముని పదమునంటియునూ - పరమజ్వాలగునమృతశిఖమైస్పర్శమగు ననభూతలింగము - అరయపరమజ్యోతితుదపరమాణువై మెరతున్ ॥గురుపతీమేలుకొనవే॥

౫౨—రాగము కేదారగౌళ.

పల్లవి.

పరిపూర్ణజ్యోతితుదపరమాణురూపమై ।
నిర్వికారంబుననునిశ్శబ్దమైతిన్ ॥

చరణములు.

అదిగొనిటలాంతమునఅగ్నికర్ణికమధ్య - పదినూరుకోట్లరవిప్రభలతోడన్ । కదసివెలిగెడిహృదయకమలాంతరంగమున - మదిప్రణవమునగూర్చిమహిమమెరయుదునూ ॥పరి॥ శిరసునడుమనఖండచిత్కళలయెడతెగక - వురువడిసుధారసమువరిషించగా । అరసి అమృతము గ్రోలిహంసచిర్వనమెగశి-మరియునాపోజ్యోతిమధ్యనిలువగనూ ॥పరి॥ అచ్చమానందకరమైనిండివెలుగుచును - స్వచ్ఛమగుజ్యోతిపై సంభ్రమంబుననూ । ముచ్చటతోపూదోటమూలమూర్తినినంటి - సచ్చిదాత్మకుడనై చాలవెలుగుదునూ ॥పరి॥

౫౩—రాగం కేదారగౌళ.

పల్లవి.

అదిజూచికలియరా అనందపదమగును ।

అదియుతానై మెరసు అగణితముగాదా ॥

చ ర ణ ము లు.

అదిగో వేదాంతముననణుతుల్యమై చెలగు - అదినజుడునదివిష్ణు నదిరుద్రుడగునూ । అదిబిందుసమరసము అభ్యంతరాళమున - అది నీటివర్ణమునఅమృతజ్యోతిగును ॥అది॥ అదిత్రియజ్ఞులుమీరి యాకాశమున్ద్రదలా - అదిప్రణవలింగమై నదిగోచరించుగ । అదిలోను వెలి నిండి కముకొనిసర్వమును - అదియుఅంతర్జ్యోతిఅంటిమెరయగను॥అది॥ అదిశిరసునకు ద్వాదశాంగుళముపైనుండు - అదినాదుబిందుకళలంటి వెలుగుగ । అదిదివ్యతేజమునఅదినిరాటంకమగు - అదియునిర్గుణతోటఅజపతై వెలుగుగ ॥అది॥

౫౮—రాగము నాట కురంజి ఏకతాళము.

ప ల్ల వి.

వెలయనేలకలుగుముక్తివిమలజ్యోతిమధ్యగురుని ।

అ ను ప ల్ల వి.

కలసితన్మయమునబైటనిలచివెలగకా ॥

చ ర ణ ము లు.

గుట్టువామమడిమెచేతగుహ్యమునుమొత్తిఅనిలు - గట్టిగపీడించిచెలగికలయప్రాణపానుగూర్చి । చుట్టియున్నభుజగిరేచి మట్టుబెట్టిచక్రపులను - అట్టెబిందుబ్రహ్మముఖము నంటినిలవకా ॥వెల॥ ఉరికిజీవహంసదివికిఉత్తరదక్షిణములుమించి - పరమటద్వారమునజొచ్చిప్రణవనేత్రమునుదెరచి । మెరసిప్రకృతులంటగాల్చిఉరిమికాలునొడుపరచి మెరసిమేరువెక్కిపూర్వమేటిగురునిజూడక ॥వెల॥ అదిగోనాదుబిందుకళలకవలమించి తేజమధ్య - మధికమించిమండునట్టియంతర్జ్యోతిపైననిలచి । సదమలంబైనతోటసద్గురుస్వరూపమంటి - పదిలుడై నిర్బయిటపరబ్రహ్మమైనిలువక ॥వెలయనేల॥

౫౯—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

నిరతమునుసద్గురునినిలిపితనమదిలోను ।

పరమతారకమనసుబంధించవలెనూ ॥

చ ర ణ ము లు.

పరమంకుతారమునప్రచరించుమారుతము - పరికించిదివికి పావ
కునిరేచి । విరివిడెబ్బది రెండు వేల నాడులలోను - తిరుగుపవనముతీవ్ర
గరిమెపూరించీ ॥నిర॥ నవరంధ్రములుమూసి దవశిఖనిలునిగూర్చి-ది
వికిఅహితీవ్రముగధృతితో నెగయించి । పవనభూతేంద్రియములబంధిం
చిమనసుతో - చివునకంఠంబునను చెలగినిలువగనూ ॥నిర॥ నడిమియిం
టనుఘంటనాదంబుమ్రోవగను - జడిగొనసుధామృతమునాసెగ్రోలుచు
నూ । కుడియెడమదృష్టులునుగూర్చినయనాగ్రమున - ఎడతెగనిధ్యా
నమునతడవి గురుగనుచుండె ॥ నిర ॥ అనుదైన గాలిచే అంతరాళము
చించి - ఉరికిబిందువుజొచ్చిఊర్ధ్వనాకిటనూ । శిరమునను బంధించిచె
లగినాదజ్యోతి - పరమునను యెపుడుసద్భావంబుజేసీ ॥నిర॥ ప్రకటము
గసహస్రదళపద్మమధ్యను వెలుగు- అకలంకమైనజ్యోతాంతరంబునను ।
సుఖమైనపూదోటసుజ్ఞానగురునంటి - సకలజీవులతుదనుసాక్షియైయుం
డుండె ॥నిరతమునుసద్గురునినిలిపితనమదిలోను॥

౫౬—రాగము కేదారగౌళ.

ప ల్ల వి.

మరియునాపోజ్యోతిమధ్య వెలుగుచునేను ।
గురురూపమైనభర్గోరూపమగుదుండె ॥

చ ర ణ ము లు.

పంచాంగమునశక్తిపంచకమునిర్మించి - పంచవింశతితత్వ ప్ర
కృతిరూపమగుచుండె । పంచవర్ణములతుదప్రణవస్వరూపమై - ఎంచి
సర్వమునంటి యేనువెలగుదును ॥మరి॥ దృష్టిద్వయములపైని త్రివేణి
సంగమున - అష్టదళములమధ్య నమృతతోయమునండె । ఇష్ట లింగం
బైనయేకపదమైనేను - షష్టకుక్షులనుహంసమునచెరియింతుండె ॥మరి॥
త్రివిధపదములజగతి తీవ్రముగనడుపుచును - త్రివిధవేదములకడ స్థిర
ముయగుచుండె । త్రివిధనేత్రములతుద దివ్యనేత్రుడనగుచు - త్రివిధా
క్షరములంటితీవ్రముగతుదను ॥మరి॥ స్థిరభూతిరసముతనదేహమునౌనె

లగగను - పరిపూర్ణసహస్రబాహువులప్రబలీ। పరంజ్యోతిశిరసుపై పరిపూర్ణవిధములను - పరమతారకనేత్రపరునిగనుగొనుచుం ॥మరి॥ పండువెన్నెలబైటపరమహంసనేను - నిండుచిత్కిరణములనిలచివెలుగుచున। దండితేజోమధ్యతారకజ్యోతినై - యుండుచునుపూతోట మహాలింగమంటిం ॥మరియు॥

౫౭—రాగము ఆనందభైరవి అటతాళం.

పల్లవి.

నిలువలేనురాధరను నిలువలేనురా।

అనుపల్లవి.

నిలువలేనుశీఘ్రముగనునీవుయేలించిననన్ను।
అలనిరాలంబపదమునందునిలుపవలెనుస్వామి॥ నిలువ॥

చరణములు.

దేహభ్రాంతులేల త్రివిధదేహవాసనేలజీవ - దేహమాదిగాను పంచదేహములనుచి। దేహమనుచునిర్వికారదేహమరసిజూచివి- దేహముక్తికోరిజ్ఞానఘట్టడగుచునిదిగొతంద్రి॥ నిలు ॥ రాగమునవిరాగమేల లలితనాల్గుపదవులేల - యోగములనుగుందనేలవుచితధ్యానధారణముల। భోగమేలనఖిలసంయోగమేలముక్తికన్య - భోగమేలనామనోత్యాగమైనపిమ్మట॥నిలు॥ వాదభేదమేలసర్వవర్ణాశ్రమాదులేల-వేదమాదిగానుశాస్త్రనిఖిలవిద్యలేలయిలను - మోదమేలతనకునట్టిభేదమేలనేకమదినిపాదుకొన్నపూదోటబ్రహ్మపదవిజేరకిక నూ॥ నిలువలేనురా॥

౫౮—రాగం కేదారగౌళ.

పల్లవి.

కటకటమగ్జనులుగర్వించిజ్ఞానులను।
కుటిలులై దూషించికూలుదురుధరనూ॥

చరణములు.

అరుదుగనుజ్ఞానిఅవనిపైవెలగుచును-అరయబిత్తొన్నమునుఆరగింపుచును। పరగబాలోన్మత్తపిశాచవృత్తితో-చెరియించనతనియిల నసలుదిట్టెదరూ॥కట॥పరమహంసైయతమప్రజలకునుభృత్యులై-గుస

సుతులయిండ్లలోగుణరహితుడగుచుఁ । మెరసిక్రీడించగను మేదినిలో జనులు-గర్వించినతనిగనిగాశిపెట్టెదరూ॥ కట॥ అరయుశరణులచేతనత డుపూజలుగొనుచు - మరివారికిని మోక్షమతము దెలుపుచును । గురు యోగియైతోటగురునిపదమైనిలచి - నిరుపమజ్యోతియై నిండివెలగగ ను ॥ కటకట ॥

౫౯—రాగము కేదారగౌళ.

పల్లవి.

ఈరాజయోగమగుయనసిచూచినమదిని ।
ఇదిదివ్యపుంజమై ఇదిప్రకాశించుఁ ॥

చరణములు.

నాసికాగ్రముతుదనునటియించుమారుతము- వాశిగదివిచితను వహ్నికిందికినీ । గాశిపెట్టుచురెంటికలియపూరించిఖ-శి-కాశిఊర్ధ్వము జేశికడమూతదెరను ॥ ఈరాజ ॥ నవరంధ్రములుగట్టినాసాగ్రమునజొ చ్చి-తివిరికంజముతానుదివికిజిమ్ముచును । దివరాత్రులునుమీరిత్రికూట ముననిలచి-వివరించిలోబైటవెదకిచూడగను॥ఈరాజ ॥ జలమధ్యసహ స్రదళచక్రంబుపైనెపుడు - నిలచినంతర్జ్యోతినిండిప్రబలగను । తల చజ్యోతాంతపరతారకంబగుగురుని - కలియపూదోట నిజఘనయోగి యగును ॥ ఈరాజ ॥

౬౦—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఇలనునిర్గుణముక్తియీవేషధారులకు ।
తెలసిచూచినలేదు స్థిరభక్తులారా ॥

చరణములు.

లేదుషణ్మతములనులేదుబహునిధినదుల - లేదుస్నానంబులను లేదుదానములఁ । లేదుమహీవేల్పులకులేదుఅర్చించినను - లేదుతప జపములనులేదుస్తోత్రములఁ ॥ఇల॥ లేదురేచకముచేలేదుపూరకముచే లేదుకుంభకముచేలేదుయీభ్రమలఁ । లేదుకేవలకుంభకాదిక్లేశము లచే - లేదు లంబికముచే లేదు చిత్పదము ॥ ఇల ॥ లేదు అష్టాం

గయోగాదిసిద్ధులకైన - లేదుధరమంత్రసాధకులకైనన్ । లేదుహఠ
రాజయోగాదిమార్గములచే - లేదుకైవల్యంబులేదువినరయ్యా॥ఇల॥
లేదుఆసనక్రియలలేదుఓంకారముల-లేదువ్రతశీలములలేదుఅపవర్గం।
లేదుబహిలులక్ష్యములలేదుధ్యానంబులను । లేదుభక్తినగానిలేదుసత్ప
దమూ ॥ఇల॥ లేదునిజస్వాములనులెస్సగనమ్మకను-లేదు భవఛేదనము
లేదుసుస్థిరమూ । పాదుకొనిపూదోటపైగురిజూడకను - లేదుతన్మ
యసుఖములేదుజనులారా ॥ఇలనునిర్గుణముక్తి॥

౬౧—రాగం కేదారగౌళ.

పల్లవి.

సర్వోపనులికదీరెచాలుధరపైచర్య।నిర్విషయులారయికనిలుతుసత్పదమై

చరణములు.

తలపకేవలశూన్యతత్వమైకదలకను - ఇలతుయేతెంచినేమలిన
దూరుడనై । అలరుఅఖండైక్యమహావచనరత్నముల - బలిమిముల్లో
కములప్రబలజేసితినీ ॥సర్వ॥ గురుకృపనునిర్లేప కుడనై చెలంగినే - సరి
లేనియవధూతచక్రవర్తినినై ।పరమభక్తులకుసుస్థిరమోక్షమొసగినే -
అరుదగునిరాలంబమగుదుయిదిసత్యం ॥సర్వ॥ వినుడినామరణంబు వివ
రింతుసుతులార - అలగునాపోజ్యోతియనుజలధిజొచ్చి । తనుత్రయము
చట్టాడ్చితారకజ్యోతెనెడి-ఘనతకాయంబెడలికడుచిన్మయుడనై ॥సర్వ॥
తెలసినేనతితుర్యదేహమువిసర్జించి - కలితనిర్మలనిరాకారమైతుదను।
బలసినిర్భయిటసత్ప్రభునిరంజనుడనై - అలరుమహాద్వైతమైప్రకాశింతుక్ ॥సర్వ॥ నేనిరాశ్రయుడనై నిర్వికారుండనై -అరుదగుఆదిమధ్యాం
తశూన్యుడనై । పరికించిపూదోటపై సర్వసాక్షినై - నిరుపమానంద
మైనెనెవెలగుదునూ ॥ సర్వోపనులిక ॥

౬౨—రాగము అసావేరి- అటతాళము.

పల్లవి.

మన్నేరనేలదుమ్మేర-వానికి-మన్నేరనేలమట్టెరా॥

చరణములు.

అంటరానిమెరుకపదవిరెంటెలోన తెగువలేక। కంటిలోనుతారక

యోగము రెంటిసందు దెలియని వారికి ॥ మన్నేర ॥ స్నానసంధ్యనిమముని
ధానము దెలియ లేక । జ్ఞానయోగులమనిమూలము దెలియని వారికి ॥మ
న్నేర॥ వుత్తభూతిబూసుకొనిబిత్తలై తిరిగేటివారికి । సత్తుగవారిగిండ్ల
కూడునిత్యమనివిన్న వారికి॥ మన్నేర॥ ఒల్లునిండభూతిబూసుకపల్లజడలు
దాల్చుకొని । కొల్లలముగపెద్దలముఅనియిల్లిల్లుతిరిగేవారికి ॥మన్నేర॥
నాలుగువేదాలుచదివినారాయణ్ణితెలియలేక । వాదభేదములచేతవా
దించితిరిగేవారికి ॥మన్నేర॥ గోళ్లుగుత్తగబెంచుకొని రాళ్లుమెడనువేసు
కొని। కాయలింగము తెలియలేకమాయపూజలుజేసేవారికి॥ మన్నేర॥ ప
చ్చనామముసాదుకొనియెచ్చరిస్తువీధులెంబడి। విస్తారముగరామానుజు
లమనియిల్లిల్లుతిరిగే వారికి ॥ మన్నేర ॥ అల్లచదువుచదువుకొని మొల్లచ
దువుచదువుకొని । వల్లెవిప్పివీధులెంబడి అల్లోయనిదిరిగెవారికి॥మన్నేర
పద్దుగపూదోటలోనవర్గికతోనేనెయున్న । ముద్దులలింగావధూతఅంటె
తెనాకేమిభయము॥ విన్నరామీరువిన్నరా- మీరువిన్నరాగురునికన్న
రా ॥ మన్నేర ॥

౬౩— రాగం కేదారగౌళ.

పల్లవి.

అతడుబ్రాహ్మణుడసుమ్మి అవనిపై జనులారా ।
సతతమును వేదాంతసారమై వెలుగున్ ॥

చరణములు.

నాసాగ్రతుడనయోనిసంభవుడగుచు - కాశిలోపలదివ్య కా
యమైపెరుగున్ । వాశివుపనేత్రుడై వహ్నిశిఖమధ్యమున - పాశరహి
తంబునను పరమాత్మయగుచున్॥ అతడు ॥ పంచకోశముమధ్యపద్మాంత
రంగమున- సచ్చిదానందనిశ్చలతమెరయుచును । పంచశిఖలును పై ప్ర
కాశించగను - పంచవర్ణములతుదప్రణవమై మెరతున్ ॥అతడు ॥ షష్ట
కుత్తులుత్రివిధచరణములుగలిగియును - దృష్టిద్వయములపై తీవ్రదీప్తు
లను । అష్టప్రకృతులనంటిఆదిమధ్యాంతమున- యిష్టమైమదిని తాయి
నునిగతిప్రబలున్ ॥అతడు॥ లవిలిత్రియుపహితధారణము మేనిపై -అవి
రళముగనుపెనగి అంటిమెరయగను । త్రివిధవర్ణములకడదివ్యజ్యోతై

ప్రబలి-వివరించగానతడువిశ్వాత్ముడగుచున్ ॥అతడు॥ అజపదంబునజం టహంసలనుసంధించి - సుజనుడై విజ్ఞానజ్యోతియగుచున్ । అజపదంబ గుతోటనాత్మరాముని గలసి - భజియింపగనతడుపరమాత్మయగును ॥ అతడుబ్రాహ్మణుడుసుమ్మి ॥

పోతులూరు వీరబ్రహ్మంగారిభార్య గోవిందమ్మగారు గ్రామములో పోలేరుపాతకములు కనుపించు సమయంబున పుత్రవాత్సల్యతకలదై మా కొమారులు అయిదుగురి తెరువురాకుండ వుంటె తరవాత గ్రామస్థుల పదుగురితోటిపాటు సద్దిపెట్టి ప్రార్థనచెల్లిస్తాను అని చెప్పుకొని వీరబ్రంహ్మంగారు సమీపగ్రామమునకు వెళ్లియుండగ వారులేని సమయము చూచుకొని సిలలుబెట్టి పసపుకుంకుమబెట్టి పూజచేయు సమయంబున బ్రహ్మముగారువచ్చి గోవిందయని పిలచి యే దేవతకు పూజచేయుచున్నావుయని అడిగినంతట స్వామి మనగ్రామములో పోలేరు పాటకములు వచ్చినసమయము మన కొమారులకు పాటకము యేమి లేకయుంటె సద్దిపెట్టి ప్రార్థన చెల్లిస్తామని యీదేవత కార్యము చెల్లిస్తూవున్నాను అని జెప్పగ బ్రహ్మముగారు ఆపలుకులు విని పోలేరుకు భయపడి యింతకార్యము చేస్తువున్నావ అని పోలేరునుచూడుము అని ప్రసన్నము జేయించు సమయంబున గోవిందమ్మకు ధైర్యపలుకులు జెప్పినకృతి.

౬౮—రాగం సౌరాష్ట్రము చాపుతాళము.

కుక్క—కూనకరిశెననికొనుచనీకేలే ॥ఏనుగనెక్కి॥పెద్ద యేనుగనెక్కి॥ పట్టిపిల్లినిదెచ్చిసాలునెయ్యిపోశి ఇంటివారుచాకిరీరీతిన । ఎగసిపుట్ల మీదవెన్నదినెటిదాన్ని ఎలుకగరిశెననివెఱపునీకేలే ॥ఏనుగనెక్కి॥యక్షమూర్తులనేవెలుగుచేతబట్టికాలవేశినకట్టె కూలగను। మితిలేనిఆకట్టె మింగికాలిపోగమిడతపడెనని మెడపునీకేలే ॥ఏనుగనెక్కి॥ సప్తకోటిమంత్రసారముదీసుకసత్యపాతాళముసాధించుక । గుత్తమైనగురుని శేవ పాముని బట్టితుట్టిపురుగులెక్కపెట్టనీకేలే॥ఏనుగనెక్కి॥వృక్షులపక్షులు యీ రీతినుండంగమలియాజమున్నది వనములోన । వెలయుకోవెలస్వరము

లారాములై నీకు । కాకులకూతలభీతునీకేలే ।।ఏను।। బలిమిగు రుజ్ఞానప్రహరిగోడబెట్టిబృందావనమేళించిందుద్రాక్షి । అందు మాపో తులూరుఆటలాడంగాను । సందుదొంగలతోటిరుద్దుపునీకేలే।।ఏను।।

—*(శ్రీపోతులూరు వీరబ్రహ్మంగారిశిష్యులు)*—

దూదేకుల సిద్దయ్యగారు చెప్పిన కృతులు.

౬౫—రాగం నాదనామక్రియ - అటతాళం.

పల్లవి.

అయ్యవీరబ్రహ్మానంద ఈశపరాకయేమయ్య ।
అయ్యరామబ్రహ్మానంద రాజపరాకయేమయ్య ॥

అనుపల్లవి.

ఏమయ్యయేమయ్యయేమయ్యానమ్మితి ।
ఏమోనామనవియేమాయనయ్యయేమయ్య ॥అయ్య॥

చరణములు.

రాత్రిపగలుయీరీతిగయేవేళ - ఖ్యాతిగయెపుడుప్రఖ్యాతిగా నునిన్ను । నిత్యపలుకునాతోనిలచిమాటాడవు-అయ్యస్వాతిమెరుపువలె జారేవదేమోయేమయ్య॥అయ్య॥ పండినపనసకుప్రజలాశపడినట్లు - స్పర్శముసోకినుముబంగారమైనట్లు। కొండవంటిఆశగోడుగువంటినీడ-యుం టివనుచునిండిపండినేనుంటిగదయ్యాయేమయ్య॥అయ్య॥ కుదురుగగురు సేవగురినమ్మియుంటేను - కదలకుండగంగగడచినరీతి । చదరకుండప ద్దుచిదిరముగాకుండ - ముదురువెన్నెలజైటముక్తియనియుంటిఅయ్య నదులుగూడినచోటనమ్ముంటినయ్యాయేమయ్య॥అయ్య ॥ దలచినచోట నునిలచిమాటాడావు-పలుచనగాకుండపదుగురిలోన । కలసిమాటాడని కారణమేమి-తలచుట్టితిరిగినతనకన్న లేరు । అయ్యతల్లిలేనిపిల్లనైతిగ దయ్యాయేమయ్య॥అయ్య॥ చెప్పరానిపద్దుచేకూడెనయ్య-ఎప్పుడుగురు సేవతప్పకయుంటిని । నిప్పువంటివీరప్పయ్యవైతేను - ఇప్పుడునామాట ఒప్పకవిడువను-అయ్యచప్పిడిగాకుండజెప్పిపోరాదయేమయ్య॥అయ్యవీ॥

౬౬—రాగము నాదనామక్రియ అటతాళం.

పల్లవి.

ఈపలుకులోపండు వెలయుంగనేవుండు వెన్నెలాలో ।

అ ను ప ల్ల వి.

పండుభావము దెలసుపరమయోగులకెల్ల వెన్నెలాలో ॥

చ ర ణ ము లు.

ఆదినారాయణునకు అందమైనపండు వెన్నెలాలో - ఇందుశేఖరునికియిష్టమైనపండు వెన్నెలాలో ॥ఈప॥ కమలగర్భునికాపాడెడీపండు వెన్నెలాలో - కమలనాభునికికావలసినపండు వెన్నెలాలో ॥ఈప॥ ముగ్గురుమూర్తులకుమూలమైనపండు వెన్నెలాలో ॥ఈప॥ ముందుగగురుశేవమోగించుటీపండు వెన్నెలాలో- పంచాక్షరియని పలుకువీరబ్రంహ్మం వెన్నెలాలో ॥ ఈపలుకు ॥

౬౭—రాగం పున్నాగవరాళి - అటతాళం.

ప ల్ల వి.

దగ్గిరయుండదిగో మోక్షము దాపునయుంగదిగో ।

అ ను ప ల్ల వి.

దగ్గిరయున్న దిముగ్గురినడుమను యిద్దరుముగ్గురుయేకంబైతె॥

చ ర ణ ము లు.

తనలోవుండదిగో అమృతముతరచేఘనులైతె- తనువెభాండువతానవెపెరుగు।తనలోకవ్యముతప్పకతరిచిన ॥దగ్గిర॥ సాలోక్యం పెరుగు తరచగసారూప్యంవెన్న । సామిప్యంబదిపాకముజేయుచు సాయుజ్యంబదిసారమమృతము ॥ దగ్గిర ॥ కుడియెడమనుతిరిగేకవ్వముగురుతుగకనుగొంటె।యెడమకుతిరిగెయెడతెగకెప్పుడునడినాళములోనాదబ్రహ్మము ॥ దగ్గిర ॥ నాదమనెటిస్తంభం తనమదినాటుకఘనమైతె।నాదమెగోప్యం నాదమెజోప్యం నాదమెవేదాతీతపోతులూరు॥దగ్గిరయుండదిగో॥

౬౮—రాగం ఆనందభైరవి-చాపుతాళం.

ప ల్ల వి.

చిక్కదయ్యా బ్రహ్మముదక్కదయ్యా ॥

అ ను ప ల్ల వి.

చిక్కదయ్యాబ్రహ్మభేద్యము చక్కనిగురుపాదపద్మము -

నిక్కముగ నెగనమ్మునారికి చిక్కనేమొకానిమాయకు||చి||

చ ర ణ ము లు.

శాంతయుక్తము దెలియక నుస్వదంతుకవిమాయనాదుల- వింత వింతడంబకాలకుయెంతమాత్రంబైనచేతికి ||చిక్క|| కులమువాసనకలి మివాసనకొలిమిలోదిగనూదిమూసన-నిష్కలితులై తెలివొందువారికి తొలగకుండునేమొకాని ||చిక్క|| తనువుధనముమనముగురునికి దార బోశియిలనుగోశి - అణగిశాంతసమాది బ్రహ్మము ఆనందముఖ్యులకే మొకాని ||చిక్క|| తెలివిలోపల తెలివిగనిగురుదేవుడనిభావించిమదిలో- తలుపుదీరాచోటికినికీలుదెలపినబ్రహ్మాదిబ్రహ్మం|| చిక్కదయ్యె||

౧౯—రాగం ఆనందభైరవి అటతాళం.

ప ల్ల వి.

శూరులైనవారు-బ్రహ్మానంద-శూరులైనవారు ।

చ ర ణ ము లు.

అహంకారమిడవలె ఓంకారమిననలె మమకారములన్ని మాన వలెరా । మహిమ తెలియవలెమర్మముకననలె ధర్మసూత్రమున తగల వలెరా ||శూ|| సూత్రలగుడిలోనుపాత్రమెకనవలె నేత్రముతనలోనెవె తుకవలెరా । గురుమాత్మకనవలెగురు తెరిగియుండవలె - గురునిజూపిన గురునిగురు తెరుగవలెరా ||శూ|| సంధి తెలియవలె అందిపొందవలెకుందర దనజోడుకూడవలెరా । అందిపరంపదంఅందిపొంది ఆనందులైనవారి పొందనలెరా ||శూ|| అనలము రేపట్టికనమగాచి తానుతనలో నెయున్నా మతత్త్వకుడు । అనుదినము తానేకమైనచోట కేకవేశి తానుతాకవలెరా || శూ|| వాదమణచియెంతో భేదములేకుండ సాధుగన్నవారె సోధకులు । ఆదిమధ్యమునవాడుకుచంబున పాదుపీరపంచచేరవలెరా ||శూరు||

౨౦—రాగము సౌరాష్ట్రము చాపుతాళము.

ప ల్ల వి.

అందరానిమానిపండు-అది-అందిత్రిమూర్తులకళవిగాకుంపు||అంద||

చ ర ణ ము లు.

కొమ్మలాకులుపూలుకూడివిత్తువీగి మదమత్సరముతోనుమహిమ

చేతి । తమ్ముడుకొడుకాయతండ్రి పెనిమిటాయె అమ్మకూతురుచెల్లెలను భవమాయర్గ ॥అంద॥ జ్ఞానుగంగుగారువీనులు ధేనులుమేనుమరచిమేత మెయ్యగను । జాణులైనవారుసోధించి తెలియండి మానులోనెమనమగ్నుడై నాడు ॥అంద॥ వృత్తిమనగయేమివిత్తనమనగేమికొత్తపూర్వము యేమిగురుతుయేమి । సత్తుచిత్తనగేమిసర్వమొక్కడె కాని ఉత్తముడున్నదిక్కునవెలుగుచుండు ॥అంద॥ చిక్కుచీకటిలోనుసివము లేనినాడువక్కడెయున్నాడువాడెవ్వడో । మక్కువగురిగనుమాపాలగలిగుంటె అక్కడమావీరగురుడుతావుండు ॥అందరాని॥

౭౧—రాగం కేదారగౌళ.

పల్లవి.

వట్టిఆచారములుకష్టమేమిటికి । చట్టిలోపలముట్టుసమసదెన్నటికి॥

చరణములు

ముట్టైతిననిసతులుమూణాళ్లుకడనుండి - ముట్టరాదనినీళ్లమునిగిమునిగి । గుట్టుతెలసితెముట్టుబట్టబైటనెయుంది గట్టిగనీమనసుకట్టినేరితేను ॥వట్టి॥ ముట్టులోనెబ్రహ్మవిష్ణుజన్మించెను - ముట్టులోనెశివుడు మూలమాయర్గ । ముట్టులోనెజగముమునిగితేలుచునుండు - వట్టినీళ్లమునుగముట్టడపోయెగ ॥వట్టి॥నవమాసములముట్టుకవగూడిదేహంబు- శివమాడబాయ్యేటిజీవులకును।బహువినాశముజేయు బహుళకుంభము నందు - పనిబూనిపోతులురుబ్రహ్మమేసత్యం ॥వట్టిఆచారములు॥

౭౨—రాగం నాట కురంజి ఏకతాళము.

పల్లవి.

ఏలకలుగుముక్తిమార్గము - హరహర । ఏలకలుగువీరశైవము ॥

అనుపల్లవి.

ఏలకలుగుముక్తిమార్గమేలకలుగువీరశైవ ।
క్రమముదెలసి సద్గురుని కరుణజెందలేనివారి॥కేల॥

చరణములు.

మాయలన్నికట్టిపెట్టిమమతలన్నిపీడగొట్టి- కాయములోవున్నగురునికరుణజెందలేనివారి ॥కేల॥ అష్టమదములణచిపెట్టి ఆరుతాణము

లుదెలసి - యిష్టమైనప్రాణలింగయీశునంతలేనివారి ॥కేల॥ తమము
లేనిబయలుజేరితన్నుతాను తెలుసుకోని- విమలమైనజ్యోతినడుమ నిలు
పలేనట్టివారి ॥కేల॥ ఆరుకమలములు దాటిహంసనంటిపరముజేరి-హిం
సకోర్చినట్టివీరస్వామినిదెలియనివారి॥కేల॥

౭౩—రాగం ఆనందభైరవి అటతాళం.

పల్లవి.

దొరుకునముక్తిదొరుకున-మనస - దొరుకునపదవిదొరుకున ॥

అనుపల్లవి.

దొరుకునమావీరగురునిగానకపొట్ట -
కొరకై తిరిగేటి తిరిపెజోగుకెల్ల॥దొరు॥

చరణములు.

బాపడమనిగడ్డిచాపలు సంచులుమోపులుగట్టుక మోసుకతిరిగి
న ॥దొరు॥ జంగాలమనిరాతిలింగాలుగట్టుక- పొంగుచుబూడిదెపూను
కతిరిగిన ॥దొరు॥ దాసర్లమనికొయ్యపూసలుమెడనేసి - దీసుకనామము
పూసుకతిరిగిన ॥దొరు॥ పీర్లనెరుంగకమాయపకీర్లని- వేషమువేసుక దేశ
ముదిరిగిన ॥దొరు॥ యిలలోమహమ్మదువీరగురుసాంప్రదాయకము-మే
లనిమాపోతులూరుగురునిగానకున్న ॥దొరు॥

౭౪—రాగము నాదనామక్రియ - అటతాళం.

పల్లవి.

బ్రాహ్మణులై తెలేరటుజేసెదనుబ్రహ్మవిలాసంపలుకరయా।

అనుపల్లవి.

బ్రాహ్మణులనగబ్రహ్మధ్యానపరాయణులై భావించరయా॥

చరణములు.

వేదశాస్త్రములుచదువుచువ్వూరికెవాదములెందుకువదలరయా-
వేదాంతంబగువెలుగుతానైమై వెలగెటిమర్మముదెలుపరయా॥బ్రాహ్మ॥
అగ్రకులంబనిఅంటిరాయనఅగ్రహామెందుకుఅణచరయా - నిగ్రహించి
అధ్యాత్మవిద్యసమగ్రమెశీఘ్రముమెజెప్పరయా॥బ్రాహ్మ॥ కాలముతప్పకకర్మ
తీర్చుటఘనులమంటిరతాళరయా - కాలమకాలము రెండును దెలియగ

శీలముగదయచేయరయ ॥బ్రాహ్మ॥ గాయత్రిజపకర్తలమంటిరికాదన గాదిదికలుగునయ - గాయత్రిజపమెంతటకలదోగట్టిగమాకదిదెలుపర య ॥బ్రాహ్మ॥ బ్రహ్మజాతమనిఅంటిరాయనబ్రహ్మసృష్టికనుపరచకయ - బ్రహ్మముశ్రీశివపోతులూరుగురువీరబ్రహ్మమెచూడరయ॥బ్రాహ్మణులై॥

౭౫—రాగం ఆనందభైరవి చాపుతాళం.

పల్లవి.

ఏకేవారము - దూదేకేవారము ।

అనుపల్లవి.

ఏకేవారములోకములోపల - పాకమైనదూదేకముజేసుక॥ఏకే॥

చరణములు.

ఇంటిలోపలయిల్లుగట్టుక । విడువకముడి దూదిప్పిగుదిపెలో ॥ ఏకే॥ ఏకాతురియనెయేకులుచుట్టుక । పాకమైననూలేకముజేసుక॥ఏకే॥ అంగములోప్రాణలింగముజలసుక - కాయములోనున్నకర్మములుతెగ ॥ఏకే॥ దాస్యధర్మముదూషణజేసి । హాస్యమైనగురుదోషకారుల ॥ ఏకే॥ వీరధర్మమువిఱవిగానునెడ । వాదుజేసెపరవాదులనెల్ల ॥ఏకే॥

౭౬—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఏటివారనిజెప్పుయేమున్నదయ్యా ।

వట్టిబూటకముయిదిమహాద్భుతమువినరయ్యా॥

చరణములు.

జలమధ్యమునఅండజములుచేజనియించె - జలమునీజంబాయజె ప్పనేమి । జలమజలములరెంటి జనితమేజీవియని - అలరుదానికి కులం బదియేడదయ్యా ॥ఏటి॥ అయ్యబీజమువలనఅమ్మచేజనియించె-అయ్యా యఅమ్మాయఅన్నితానాయెగ । వెయ్యారుజీవులనువృత్తులనుగల్పించి- అన్నివర్ణములన్నిఅతడాయనయ్యా॥ఏటి॥ధరశాలివాహనుడుతాజేయు భాండములు - దనగయిండ్లిండ్లకునుదయచేయలేదా । అరయఘటము లజలంబన్నిపూర్ణంబాయ - అరసిగంగాకులం బేర్పరచరటరయ్యా ॥ ఏటి॥ కోటిసూర్యప్రకాశితబొందియీశుండు - ఘటముగకులములెన

బదినాల్గురౌనాయన్ | కూడస్థుడై యుండి కోర్కెలీడేర్చినా - ఘూట ముగకులములన్నతడాయనయ్యా ||ఏటి|| నెట్టుకొని వేదములుదిట్టముగ బలుకగ - గట్టిగపోతులూరయ్యతానాయన్ | వట్టిభ్రాంతులెకాని వసుమతిలోకులమేది - గట్టిగనారాయణుడేజీవకోట్లాయన్ ||ఏటివారని||

౭౭—రాగం ఆసావేరి అటతాళం.

పల్లవి.

సిద్ధిబొందెననిజెప్పేరు - హరహర - సిద్ధిబొందెననిజెప్పేరు ||

అనుపల్లవి.

సిద్ధిపొందెననిజెప్పెరుశివశివసద్గురుని |
కద్దులేదోయన్నచోటకలగదెలిపెవీరగురుని ||సిద్ధి||

చరణములు.

మూడుమొనలుదాటిపిమ్మట మేడనడిమిదిమీదిపేటు | మూడు మూడువక్కలైనమూలబ్రహ్మమైనవారిని||సి||ఇంటిలరింటిపై ఇంటిలోను ఇంటిమూల | అంటిఅంటకఆటలాడే అంటిఆపోజ్యోతైనవారిని||సి||రూపులుఆగమ్యమైనరూపులోతానొక్కరూపై | రూపులోవేరొక్కచూపై చూపురూపుదాపుగురుని || సి || తనువుగోసితన్నుజూచితనువులోనె తానుజూచి | తనువుయెప్పుడుతానెతఅచిత న్మయతారకమూర్తిని ||సి|| లాలితశివపరతత్వలోలుడై తాఘాలమున|నాలలాడుచుకై లాస వరదడు మహాత్ముడువీరగురుని ||సిద్ధిపొందె||

౭౮—రాగం హిందుస్థాని కాఫీ ఆదితాళం.

పల్లవి.

ఏలనీమోహమిడజాలవేమే | ఫాలాంతమందుగోవిందగురుడే ||

అనుపల్లవి.

ఏలయీలీలవ్రాబాలమాపాలదయ|చాలగమించిజనజాలిపడకే ||ఏల||

చరణములు

లేకయామేకపతిరేకకై మీాకు | తలగీకెనూకాకవై నేకమటవే|| ఏల|| కన్నుగవసన్నతొలికన్నమిగిలున్న | వెలుగన్నమనిజెప్పగవిన్నవటవే ||ఏల|| పంచశిఖమించిరిపుద్వంచి హరిగాంచిపురి | పొంచివుండేది

బహుకొంచమటవే ॥పల॥ ఆరుముదమీరమున మేరుసహస్రారమునచే రివిహరించుటదిభారమటవే ॥పల॥ వాటముగబాటలో మేటిశిఖదాటిశివ । కూటమనెమాటచెవినాటదటవే ॥పల॥ గ్రక్కునదిక్కొనముక్కుతుదచక్కగ । దిక్కువిహరించుటదియెక్కువటవే ॥పల॥ మెప్పుగపోతులుకుఅప్పుడె గొప్పగురి । జెప్పినాడికమనప్పివినవే ॥పలనీమోహ॥

౪౯—రాగం ఆనందభైరవి అటతాళం.

పల్లవి.

పలుకుపలికెవినరా - ప్రణవముపలుకుపలికెవినరా॥

అనుపల్లవి.

పలుకుపలికెదినుపశ్చిమవీధిన-కులుకుచుప్రణవముకూతలుబెట్టుచు ॥ప॥.

చరణములు.

గండ్లుమూసిపట్టి గుండ్లనుతిరుగకుండబట్టి । గండ్లకుపైగనుగుండ్లకునడుమను - ఉండజూడుమని ఓంకరించెను ॥ పలు ॥ వింటిమూలమింటి - ఆరితెజంటబాయకుంటే । అంటిఅంటకయింటిలోయుండెబంటరివాడైవై పునగనుగొని ॥పలు॥ నెమ్మతితోచూడు-ముమ్మూల-ముక్తికమలమండ్రు । ఘుమ్మునప్రణవముఘుమ్మునపలుకుచు । నమ్ముదువీరమహమ్మదుసాక్షిగ ॥పలుకు॥

—*(దూదేకులసిద్దయ్యగారి శిష్యులు పలుగురాళ్లపల్లె)*—

గోవింద బొట్లుగారి కృతులు

౫౦—రాగం - కేదారగౌళ.

పల్లవి.

నన్నుకులమడిగేది న్యాయమతమకు ।
కానికులమేలేదు ఘనులుతామైతె ॥

చరణములు.

నాదుబిందుకళలనాదెమగునాకులము - వేదాంతరహస్యమున వెలిగేటికులము । దశవిధంబగునాదుధరణిలోనాకులము-పిపిలికాదిబ్రహ్మాపీఠమగుకులము ॥నన్ను ॥ కలదుజీవులయందుకారణంబగుకులము-కల్పవృక్షమురీతి వెలయుకులము । ఏడేడుభువనములు యేకమైనదికుల

ము-ప్రాకటముగ గురుని ప్రణవంబు కులము॥నన్ను॥ జీవకోటుల కెల్ల జీవ మైనదికులము-జీవుడే దేవుడని తెలసేదికులము। తెలియనిజీవులకు తెలసే దిగురుకులము-కలసి తెలియుడిసిద్ధకారణ మెకులము॥నన్ను కుల॥

౨౧—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఏజాతిబుట్టిన మెక్క-వేగాద - ఆజాతిశివజాతియని శ్రుతులుబలుకగా॥

చరణములు.

బురదలోపల నెపుడుపుట్టదకమలంబు-మొరపరాళ్లనువజ్రమణిబుట్టలేద। జారకాంతకువశిష్ఠుజన్మించగాలేద-గరిమెవాల్మీకులదిఘనమైనకులమ॥ఏజాతి॥ కట్టెలోపలనగ్నికణగిపుట్టగలేద-మట్టినను హేమంబుమహిబుట్టలేద। పుట్టడాశమనకుడుభువికుక్క-కడుపునను-గుట్టుదెలసి తెగార్గేయకులమేటికులము॥ఏజాతి॥ సాలెపురుగునపట్టుజన్మించగాలేద మేలైనమృగమునకస్తురిబుట్టలేద। చాలశివసిద్ధగురుసంగరంబులచేత-యీలాటిజన్మములుయిలబుట్టలేదా॥ఏజాతిబుట్టిన॥

౨౨—రాగం కేదారగౌళ,

పల్లవి.

అజపగాయత్రిపఠియించు అతడుబ్రాహ్మణుడు।
శివభజననేరనివారుద్విజులై రిగాక॥

చరణములు.

ఓంమిత్యేకాక్షరబ్రహ్మమనిశ్రుతులుబలుకగా - అక్షరబ్రహ్మంబు ఆత్మలోగనలేక। లక్షచదువులుచదివినందునమోక్షమేమి-లక్షచదువులుచదివిచచ్చిరింతేకాని। అక్షరంబనెప్రణవమోక్షమెరుగకను॥అజ॥ ఆపోవాయుమనెటిశ్రుతులుబలుకగను - ఆపోవాయుమనెటి రూపంబుగనలేక। వాపోయిచదివితెవచ్చునముక్తి-ఆపోవాయుమనెటి దీపంబుగనలేక-వాపోయివదిరితెవచ్చునఫలము॥ అజ॥ బంధశాస్త్రముచదివి మోదమలరుటెకాని - నాదుబిందుకళనాశెమెరుగకను। వేదశాస్త్రములన్ని వెతకిచదువగనేల-మాధుర్యమనెగురునిబోధదెలియకను॥అజ॥ మందూకములరీతిమెందుగచదువుకొని-గంఢదొంగలచేతకనలేకపోయి

౭ । పుండరీకమువంటిదండి తేజమునెక్కి - అండబాయకనుండు బ్రాహ్మ
ణోత్తముడు॥అజ॥ కులముశ్రేష్ఠులమనిగునిశమాత్రమెకాని-కులమెం
చగఋషులకులమేటికులమో। కలియుగములోయుగ్రకాయపండినరీతి
కలగొల్లసిద్ధగురుబ్రాహ్మణుండాయెను॥అజపగాయత్రి॥

౫౩—రాగము సౌరాష్ట్రము చాపుతాళము.

పల్లవి.

చక్కెరవంటిదిపండు-అది-చిక్కదుయెవరికిచక్కనిపండు॥చక్కె॥

చరణములు.

హితవ్రులుయేద్దురువెతకిరిఆపండు - మరిసత్యవాదులమరిగియుం
డు। సతులపతులయెంచుసమ్మతిగయుండు-జాతిలేనిపండుశరణులకుండు॥
చక్కెర ॥ భూమిఆకాశముపుట్టిననాడుచెట్టునైక్కైపుట్టియుండు-నె
ట్టనపువ్వులుపిందెలుకాయలు।గట్టిగయాపండుచెట్టునయుండు॥చక్కెర॥
చెట్టుమొదలులేదుచుట్టుకావలుండు - బట్టబైలువుండుభావముండు।
దిట్టముగనాల్గుకొమ్మలైదువుండు।పట్టులేనిపండుపైగనెయుండు॥ చక్కె
ర॥ఇలలోనయీపండుయింటయింటవుండు-నగులాకుఆరితనవడకుండు।
వలశిబ్రహ్మాదులవైష్ణులయొద్దను - నాట్యమాడుచుండునయమొప్పుచుం
డు॥చక్కెర॥ఏడులోకములువెలుగుచుతావుండు-కిళలంపుఆపండుకమ్మి
యుండు । ధర్మముజెప్పివదారిమునులవద్ద - ధరలోనుమాసిద్ధగురుడం
దెయుండు ॥చక్కెర॥

—*(శ్రీపోతులూరు ఈశ్వరమ్మగారిశిష్యులు)*—

తిరువీధిబాబయ్యగారు జెప్పిన కృతులు.

౫౪—రాగం నామనాదక్రియ అటతాళం.

పల్లవి.

బ్రహ్మనిష్ఠుడైనందుకుగురుతు బ్రహ్మస్థానముదెలియవలెను ।

అనుపల్లవి.

తన్మయమునతాతఅచిఆత్మలోతారకబ్రహ్మమునంటవలెను॥

చరణములు.

చిన్మయరూపముతానై వెలిగ శ్రీగురుమూర్తినిజేరవలెను - జ

న్మ దేశమునఉన్నని దెలసిజాతిభేదములుమానవలెనో । కన్మనిమీగడపంచధారవలెసొమ్మని మెక్కుచునుండవలెనో।దిమ్మరినై తాదిరుగుచునుండక సొమ్ముసొమ్మునను గలుపవలెనో ॥బ్రహ్మ॥ నిగ్రహించి తానున్నచోటుకనినీలమేఘమును చేరవలెనో - యజ్ఞగుండమున వెలుగుచునుండే హేమ తారకము దెలియవలెనో । స్వగృహమున తాసూటిగనెప్పుడు-సూక్ష్మ ద్వారమునమెలగవలెనో-ప్రజ్ఞలపోరలక ప్రభువునుగనుగొని నిగ్రహించి తానిలువవలెనో ॥ బ్రహ్మ ॥ ధర్మమార్గము వెతకిచూచి తా దారికినడుమనుజేరవలెనో । కర్మములోపలఅణగియుండెటి కాంతనుమనసున వెతుకవలెనో। కర్మబంధములుపిడుచుటకోరకై కారణగురుపదమందవలెనో । నిర్మలపదమనినిజముగనమ్ముక నిర్మలుడై తానుండవలెనో॥ బ్రహ్మ ॥ చూపులనడుమను వెలుగుచునుండెరూపరిదాపున జేరవలెనో । చూపురూపు తానేకము చేసుక సూటిగనడుమనుచూడవలెనో । పాపలనడుమనుఆడుచునుండెప్రణవసూత్రమది తెలియవలెనో । కాపరిగాకనుకన్నులనడుమను కన్నవానిగురు తెరుగవలెనో ॥బ్రహ్మ॥ ఆరుచక్రములకావలయుండె మేరుశిఖరమున జేరవలెనో । తారకబ్రహ్మము తానై వెలిగెవీరగోవిందునిచూడవలెనో । సారెసారెకుయీశ్వరిచరణముసద్గురుడనిమదిదలచవలెనో - సారమైనగురుయీశ్వరిపాదము పరమధర్మమనిపట్టవలెనో॥బ్రహ్మ॥

రాగ — రాగనాదనామక్రియ ఆదితాళం

పల్లవి.

శివోహంశివోహంసోహంసోహమనరా సంతతము ।
హంసోహమనరసంతతము ॥

చరణములు.

వింతగజూడవలెర-పంతములన్ని విడర- అంతనీవని బ్రహ్మమని తెలియవలెరసంతతము ॥శి॥ పుట్టినపుట్టుకనర- ధిట్టముగనువినర-ఇట్టిబ్రహ్మము నేనని తెలియవలెరసంతతము ॥శి ॥ రామంనామమనర-నీమముతోడగనర - రామబ్రహ్మానందరసము నేనరసంతతము ॥శి॥ శ్రీధరుడితడనర-మోదముతోడనర-ఆదిమధ్యాంతరంగమునీవెకదరసంతతము॥శి॥ అంగమునందుగనర-లింగమునీవెకదర-అంగసంయోగలింగమునీవెకద

రసంతతము ||శి || యోగము చేయవలెర-భోగమునందు గనర బాగుగ భ్రూమధ్యపరునిగనవలెరసంతతము ||శి|| వంచనలేకవినర-కొంచముగా దుకనర - పంచభూతములకావల బ్రహ్మమనరసంతతము ||శి|| కోశము జూడవలెర-వాశిగనిల్వవలెర-ఆశలన్నివిడనాడనివదేరసంతతము ||శి|| కం బ్రహ్మమనర-కుంభినిలోనవినర-కం బ్రహ్మమనినీవెకానంగవలెరసంతతము ||శి|| కంటిసేనర - ముక్కంటితడనర - ఒంటిగాడై యున్న వై పెరుగ్గవలెరసంతతము ||శి|| పొందుగనీవువినర - పోతులూరుగనర - యిందుపేర బ్రహ్మంవిధమెగుగవలెరసంతతము ||శి|| ప్రాపునజేరవలెర-దాపుననిల్వవలెర | ఇంపైన శ్రీగురుయీశ్వరినిగనరసంతతము||శివో||

౮౬—రాగము మాయామాళవి ఆదితాళము.

పల్లవి.

కాశికిపోనవలెనా-తీర్థము మోసుకరానవలెనా |

అనుపల్లవి.

కాశితీర్థముకన్నులయున్నది - జేసికన్నుశివకాశైయున్నది||కాశి||

చరణములు.

అంగములోపలనూకూడలిసంగముదాపునను | గంగయమునలురంగుగపారగ - రంగుగనడుమనులింగముండగను ||కాశి|| కోనకుపై గానుతీర్థసోనగురియగాను | మేనుమరచికానకతిరిగెవు - లోనువెతకిశివధ్యానము చేయగ||కాశి||భావములోపలనాజీవునిజావు తెలియవలెను-జీవగుణంబులుచిక్కవిడచితా | జీవబ్రహ్మముతావుదెలిసితే||కాశి||వాసిగధరలోను-కాశినివాసుండగాను | చేసినపాపముబాసిపోవునని కాశికి పోదురునివాసునిగానక ||కాశి || పొందుగధరలోను-వీరగోవిందుడుండగాను | అందమైనగురుఈశ్వరిపాదములందిశక్తిలాసమందేయున్నది||

౮౭—రాగము సౌరాష్ట్రము ఏకతాళము.

పల్లవి.

నడిమికంటిలోనునారాయణుడున్నాడునాదులారా |

అనుపల్లవి.

మడుగులోదీపముమలయుచున్నాడువ[illegible]ఎలారా ||నడి||

చ ర ణ ము లు.

ఎడమకుడులనడుమ వెలుగుచున్నాడు వెలదులారా । ముడి
బొమ్మలసందుమురియుచున్నాడుముదితలారా ॥ నడి ॥ ఒడయనిము
ఖమూనపొడమినవాడమ్మవనితలారా । పుడమిలోపలయీపుణ్యునిగా
నరెపూబోణులారా ॥నడి॥ నీళ్లకుండలకాడనిక్షేపమున్నదినీతులారా।
నీళ్లమునిగితనవ్రేళ్లుయెంచినరాదునెలతలారా॥నడి॥ వేళ్లుపారిలోకమం
తనిండినాడువెలదులారా । గోళ్లుపెంచుకయెంతోగానగినదొరకదుగు
మ్మలారా ॥నడి॥ జంటనాగస్వరము నంటుకయున్నాడుజాణలారా।అం
టితామరనీరంటనియట్లనుఅతివలారా ॥ నడి ॥ మింటినడుమమిథునశే
షమైయున్నాడు మగువలారా । కంటిలోపలముక్తి కళలంటిపెనగరె
కాంతలారా॥నడి॥ మండలత్రయముననిండియున్నదమ్మమగువలారా।
పుండరీకమునందుపొందినఘనుడెటపొలతులారా॥నడి॥ నిండివిశ్వమంత
నెగడినవాడమ్మనెలతలారా । పండుపండిలోకపక్వమైయున్నాడుపణతు
లారా ॥నడి॥ ఉన్నదున్నట్టుగివునికితెలసినవారికువిదలారా । సన్నబి
లములోనసాకారమైయుండుసఖియలారా ॥నడి॥ తన్నుతాతెలసిన ధ
న్యులకీపండుతరుణులారా ।కిన్నచోటనయుందికినియనుభవించరెకాం
తలారా ॥నడి॥ కందిమల్లెయపల్లెమందిరమునయుందికాంతలారా ।
ఇందుధరుడువీరగోవిందబ్రహ్మోముఇంతులారా ॥నడి॥ అందమైనగురు
యీశ్వరాంబపాదమతివలారా । చెందినవారికిచేదొరుకు యీపం
డుచేడెలారా ॥నడిమింటిలోను॥

౨౨—రాగము ఆనందభైరవి చాపుతాళం.

ప ల్ల వి.

అందమైనపూలుగోతామ - ఆత్మయెందుయీశ్వరిపూజచేతామా॥

అ ను ప ల్ల వి.

కందర్పజనకునియిందిరశ్రీదేవి । బిందుపీఠమునందుపొందికైయున్నది॥

చ ర ణ ము లు.

భావాభావమునందుజూతామ-భక్తజనులసంతోషముచేతామ
సేవజేసిరవ్వజేసియింతటనైన- భావములోపాలయేమారకమన॥అంద॥

శ్రీగురుశతడనిదలుతాము- మనచిత్తమందుతలచిచూతాము। ఓమహి
నందనమామహిమ తెలసియుసామజవరదునిసతికిపూజలుమన॥ మంద॥
కమ్మనిసుధురముగ్రోలుచు-మనము నెమ్మతీగాపూలుగోయుచు । ఉన్మని
భావములిమ్మనిమదిలో । నెమ్మతిగపూజనేర్పుగనుమన॥మంద॥ అంగము
లోపలజూతాము - భుజంగభూషణుసేవచేతాము । అంగములోపలలిం
గముగనుగొని-అంగసంయోగముశృంగారముగమన ॥మంద॥ మూడా
రువాకిళ్లుమూతాము- మనమోక్షద్వారముతలుపుదీతాము । వేడుకతో
పోతులూరునివాసునియీడపింగళనడుమవీరగోవిందుని॥ అంద ॥ పట్టితి
మమ్మమీపాదమూ - బట్టబయిటబ్రహ్మపూజ చేతుమూ । గట్టిగశ్రీపో
తులూరుయీశ్వరిదేవిపట్టినినన్ను చేపట్టిరక్షింపుమీ ॥అంద॥

౪౯—పున్నాగవరాళి-అటతాళం.

పల్లవి.

బాలనుకృపజూడు-ఈశ్వరి బాలనుకృపజూడు ॥

అనుపల్లవి.

బాలనుకృపజూడుమేలుగయిప్పుడు-పాలజలధిమమ్మేలినయీశ్వరి॥బాల॥

చరణములు.

చిన్నప్రాయమునను-శిష్యకుశిశువునుమీదయను। మన్ననతో
డుతచిన్నికొమారునివన్నెమీరగను యొసగినయీశ్వరి ॥బాల॥ గండ
దోషములనూ-వేగమెచండివేసిదయనూ । అండపిండబ్రహ్మాండనాయ
కి-గండముగడుపులండై యీశ్వరి ॥బాల॥ పాదకమలమందు-నీదయకు
పాత్రుడనేనంపు - మోదముతోనామొరలాలకించవేదగోచరనియెన్ను
దుయీశ్వరి॥బాల॥ అంతరంగముననూ-ఆపదచింతనతోడుతనూ।కాం
తసంహారునిగన్నతల్లిమా-చింతలుదీర్పుముశ్రీగురుయీశ్వరి ॥బాల॥ నేర
ములెన్నకుమీ - శిశువునుపారమైనదయనూ । మేరుశిఖరమునవీరగో
విందస్వామియీశ్వరిసాష్టాంగంబులు॥బాలను॥

౫౦—మేలుకొలుపు.

పాలుగొనరేఅమ్మలార-పాలుగొనరెయక్కలార । మానకనుసే
వించువారికి-మధురమగుపాలూ ॥అమ్మాపాలుకొనరే॥ జ్ఞానవిరహులై

నవారికికానరాదు త్రికూటపర్వత - సోన దేశమునందు చీకటికోనలోపల
నూ । పూనిముప్పైయారుఅవులుపొసగమేయుచుగనసమరస - ఐన
జీవన్ముక్తికినిసుఖసంధానమగుపాలూ॥ అమ్మాపాలు ॥ రెండుకొండలనడు
మకొంచముగండివయ్యనదూరియౌఖళి-పండువెన్నెలబైటసమరసభా
వమునసమరీ । కండగలశోధాగ్నిశిఖరనుగాచి లెస్సగవడియబోసిన -
దండిరుచులనుతెలసినా వేదాంతమగుపాలూ ॥ అమ్మాపాలు ॥ మొదద
భుజగముజాడగ్గైకొనిగడుమటావులుదాటిమెల్లన - చాయకాలువవం
కత్రోవలగడచివేడుకల తొడసితొడబడివడశిఅవు - మొడదభుజగ
మువేగపంటలు - తొడసితొడబడిపితికితెచ్చినచోద్యమగుపాలూ ॥ అ
మ్మాపాలు॥సారమగుచుసరస్వతినదిచేరునను నొకచంద్రగుండము-తీరము
నమధురసన్నుతిధారలుకగనూ । కోరిసద్గురువాక్యపద్ధతిదారితెలసిమ
నోజపంబున - చేరినేర్పునపితికితెచ్చినచిక్కనగుపాలూ ॥ అమ్మాపాలు॥
సరసమగుభవరోగములకును-అవుషధంబిదిదీనిగ్రోలెటి । పురుషులకు
మరిజననమరణములెరుగరెన్నడునూ - కరుణతోచెంగల్వపురమున గు
రుడుయీశ్వరికరుణచేతను సరసపదమునఉద్భవించినసౌఖ్యమగుపాలు॥
అమ్మాపాలుగోనరే ॥

తిరివీధిబాబయ్యగారి శిష్యులు పొదిలెతాలూకాలో
చేరిన గుండ్లసముద్రము కాపరస్థులైన
—*(వేమలక్ష్మీపతిఅయ్యగారుచెప్పినకృతులు)*—
౯౧—రాగం పున్నాగవరాళి —చాపుతాళం.

పల్లవి.

అమ్మేవారము - దిను - నమ్మేవారము ।

అనుపల్లవి.

అమ్మేవారముయిమ్ముగనెప్పుడు - కమ్ముకున్నమాకర్మములుతెగ॥

చరణములు.

రాజసతామససాత్వికముల- రమ్యమైనశ్రీరాజుకునుతెగ ॥నమ్మే॥
ఆరుగుణములఅమరబట్టుకొని - అలంపూరిలోఅంబకునుతెగ ॥ నమ్మే ॥
వైశ్యకులములోవైపుతెలసుకొని-వైనమునదంబులవల్లగనుమే ॥నమ్మే॥

దూ॥ ణచేశేదోషకారుల-పాషాణముతో పల్లవిరగతెగ ॥నమ్మె॥ అంటు ముట్లయనెలమితగుణములను-అంటబట్టిఅరకానుకును తెగ॥నమ్మె॥ చిత్తు యని మెటిచిల్లరదినుసులు-సత్తుమైనసరిలాభముజూచుక ॥అమ్మె॥ అష్ట మదములుశ్రేష్ఠలెరిగిగురు-నిష్ఠతోనుఆకష్టములన్నిట॥అమ్మె॥ సప్తవ్యాస నములసందుతెలసుకొని-సప్తగిరులపైసాకారముకును ॥అమ్మె॥ పంచేం ద్రియములపర్వచేయకను - పొంచిపట్టికొనిపోతులూరులో ॥ అమ్మె ॥ వి త్తనంబుమాపీరగురుడుహరి-విశ్వములోపలవిస్తరించిమే॥ మమ్మె ॥ ఈ శ్వరిపాదముహితవుతెలియక-హాశ్యముజేసేఅంధకారుల॥అమ్మెవారము॥

౯౨.—రాగం ఆనందభైరవి-త్రిపుటతాళం.

పల్లవి.

ఆర్యశ్రీబాపనార్య - శ్రీతురిమెళ్లశౌర్యశ్రీదైర్యవర్య ॥

అనుపల్లవి.

ఆర్యఅంతర్లక్ష్యమెప్పుడు శౌర్యమునుమంటగలిపిధైర్యము తో బ్రహ్మపదముదారితెలసినిలువెమనస॥ఆర్య॥

చరణములు.

ఇడపింగళలురెంటూ-జోడుగయెపుడు - జాడనుదిరుగుచుండు- వాడలోపలనైపుదెలుసుక మేడనడుమనిలచినీవు - వేడుకతోసంసార భ్రాంతులకూడియుండకేఫాలమునను ॥ఆర్య॥ హంసలజూచెవిధము-ఘ టములోయున్న - సంశయముడిగెనయము॥హంసనెప్పుడుఆత్మలోపల హింసలేకనునాశికాగ్రము - హంసఓంయనెగురునిపాదమునిమిషమైనే సారకుండవె ॥ఆర్య॥ చక్కగభ్రూమధ్యమూ-మిక్కిలిదృష్టిమక్కువతో జూచెమూ। చొక్కమగువేదాంతసారముగ్రుక్కనునుజివ్వానుదీసుక- వక్కనైనసోహమునునుధిక్కరించక కలియుమనస ॥ఆర్య॥ పాతకములు తరిమీ శ్రీపోతులూరు-చేతనుగురునినమ్మి। మాతయీశ్వరిచేతయిప్పు డుఘాతకములోమునిగిపోయెను - చేతనైశౌంభులింగస్వామినికనుపో వెచెలియ ॥ఆర్య॥ కరుణించిరక్షించెను-శిష్యులనెల్ల-అరమరలేకుండను। వరములిచ్చెను అజపమార్గము-స్థిరముగశ్రీబాపనార్యులు - వరుసతో హంసలనునెప్పుడునాలలాడుచువుండుమనెను॥ ఆర్యశ్రీబాపనార్య॥

౯౩—రాగము సురట చాపుతాళము.

పల్లవి.

పతిమాటిని గురుసతతము మెప్పుడు మతిని యున్నది ఆడది।

అనుపల్లవి.

పతిమాటెప్పుడు పరవ చేయక నుకసురుకొన్న దొకగాడిది ॥

చరణములు.

గురుమాటెప్పుడు గర్వము లేకను గురిగానున్నది ఆడది। మర్మము దెలియక నిర్మలమెరుగక కర్మమునున్నది గాడిది ॥ పతి ॥ అండపిండబ్రహ్మాండములన్నియు నిండియున్నది ఆడది । కండలు బెంచుక మొండి కుక్కవలె చెండితిరిగె దొకగాడిది ॥పతి॥ నీమము తోడుత కామము దెలసుక స్వామిని దెలశిన దాడది- ఏమి దెలియకను మోహము పెంచుకొని కామమునున్నది గాడిది ॥పతి॥ పురుషుల చూచితె పొరలక మనసు సరిగ యున్నది ఆడది। మెరశె మొగ్గవలె మేను దిప్పుకొని ఆడుచునున్నది గాడిది ॥పతి ॥ పెద్దల చూచితె బుద్ధిగ యెప్పుడు సద్దుగ నిలచిన దాడది । పెద్దగ్రహమువలె రద్దు జేసుకొని మొద్దుగ నున్నది గాడిది ॥పతి॥ అంగములోపల లింగముకనుగొని సంగతినున్నది ఆడది । చెంగలించుచు పొంగుచు నరులను భంగపరచినది గాడిది ॥పతి॥ గురుడె పతియని పరము దెలుసుకొని సరిగనున్నది ఆడది। గురుని మనసు నరునిగ జూచుక పొరలుచున్న దొకగాడిది ॥ పతి ॥ షడ్గుణములను సారము తెలసుక భర్గునిగనుగొను దాడది । వర్గములోపల వగచి కలసుకొని సిగ్గులేని దొకగాడిది ॥పతి ॥ చతురాక్షరమగు పోతులూరు వీర సతతము దెలసిన దాడది- హితవుగ ఆత్మలో యీశ్వరి పాదము మతినదలు వనది గాడిది ॥పతి॥ మరువక తిరువిధి గురుని మంత్ర మేమారక యున్నది ఆడది । కారణ గురుని సారము దెలియక మీరిపోయిన దొకగాడిది॥పతిమా॥

౯౪—రాగము సావేరి చాపుతాళం.

పల్లవి.

శివశివయని యె మంత్రము చెవులకు స్థిరముగ దెలసే దెన్నటికో ।

అనుపల్లవి.

శివనామము నా జిహ్వాయెందున సిద్ధమునుండే దెన్నటికో ॥

చ ర ణ ము లు.

జాగ్రస్స్వప్నసుషుప్తులు దెలసిజాగ్రతనుండెదెన్నటికో - అగ్రజన్మమునంతు దెలసుకొనిస్వగృహామెరిగెదెన్నటికో ॥ శివ ॥ భర్గునిమదిలోబాగుగనమ్ముక వర్గము దెలసేదెన్నటికో - మొగ్గక కామునియగరగొట్టినేనిక్కు తెలసుటది యెన్నటికో ॥శివ॥ ఆరుగుణములనుఅరగనమ్ముకొనిమేరుపయెక్కెదెన్నటికో ॥శివ॥ కోరిక లేకనుకామగృహములో చేరువ తెలసేదెన్నటికో - ధరణిలోపలధర్మము దెలసుకధాతనుగూడెదెన్నటికో॥ శివ॥ కుండలిస్థానమునిండుక యుండెకూర్మము దెలసేదెన్నటికో - మంతెటిఆపోజ్యోతినిజూచుక మరణము దెలసేదెన్నటికో ॥శివ॥ స్వాతిమెరుపువలెపోతులూరుగురుఖ్యాతిగజూచేదెన్నటికో - పాతకములుపోతరిమెయీశ్వరిమాతను తెలసేదెన్నటికో ॥శివ॥ మరువకతిరువిధిబాపనార్యులనుమనసునదలచేదెన్నటికో - హరహరయనినామనసులోపలవిజవిగబలికెదెన్నటికో ॥ శివశివయనియెమంత్రము॥

—*(వేమాలక్ష్మణాచార్యగురుస్వాములవారిశిష్యులు)*—

చుండూరు రాఘవయ్యగారు జెప్పినకృతులు,

౯౫—రాగం పున్నాగవరాళి చాపుతాళం.

ప ల్ల వి.

అంబానను బ్రోవవే- శాంభవిరావె- అంబానను బ్రోవవే।

అ ను ప ల్ల వి.

అంబానను బ్రోవుడింభనుతభక్త।
బంభాపాలనబింబోదరీరావె ॥అంబానను॥

చ ర ణ ము లు.

బిందూ-బీజము రెంటి సందు-పొందియున్నా-వందూ-డెందము గనుగొందూ।ఇందుముఖినిన్నెందుజూడపర-మందు వెలుగుకృతులందు విందునమ్మ ।అం॥ వాణీ- విద్యకుమూలవేణీ-నిర్ణయరాల-రాణీ-నిజమె రాజధానీ।సన్నుతించమొరలెన్న నీకన్ననాకున్న దేమివేగ విన్నవించితితల్లి ॥అం॥ శూగీ-శైత్రుసంహారీ-పరముకోరు-వారీ - ప్రణవమూలకారీ। దారినీవెసర్వార్థములకుపర-దేవిరావెభక్తదరులు జూపవెతల్లి॥అం॥క

రుణీ-కారణముక్తాభరణీ-చరమశేష-స్మరణీ-జేర్చవె ధర్మపురిణీ। పరమ కల్యాణినీమరుగుజొచ్చినమూల-మెరిగిచిన్మయసుఖ మరుదుజూపవమ్మ॥ అం॥ అంబీ-అంబరవీథిబింబీ-శంభురాల-గంభీ - జయముపలుకుడింభీ। అంబుజనేత్రివిడంబములకీర్తి-గంభీరమగురక్షణంబుజేయవమ్మ॥అం॥ రసనీ-రాజయోగపసనీ-రసికులకెల్ల-వశినీ-రాగాదూలకసినీ।పసనీవెపరమ నివాసదాసహృదయ-రసలీలరాగాదెరాఘవేంద్రుదెమొర ॥అంబ॥

౯౬—రాగము నాదనామక్రియ అటతాళం.

పల్లవి.

అన్నపూర్ణరావే - నాదుకన్నతల్లిపీవే।

అనుపల్లవి.

అన్నపూర్ణనీకన్నఇతరులెవరున్నరనుచుమదినెన్నిదలంచెద॥అన్న॥

చరణములు.

చిన్నవాడననుచు - నాపైమెన్నవేమి గడుచు। ఎన్నివిధంబులవేడినందుకా - పన్నతభక్తులనాదరించవే ॥అన్న॥ సర్వరూపివైన - నన్నిపుకరుణజూడవైన। వరములనుచునీమరుగుజొచ్చిగురు - పరముజూపుమనిప్రణమిల్లితినే ॥అన్న॥ దుష్టసంహారాది- దేవి సృష్టిపాలమోది। అష్టకమలమంతిష్టయోగసదృష్టినిలిపినాకష్టముదీర్చవె ॥అన్న॥కరుణజూడమనుచు - దేవికోరిమదినిదలతు। ఆరుచక్రముల కావలయుండె - నీరుపీఠముననిండివెలింగెడి ॥అన్న॥ బిందుపీఠమున-దేవి పొందిక మరియున్న। సుందరాంగినీవెందుయున్ననా - హృదయమందుపదమందిగణించెద ॥అన్న॥ జ్ఞానయోగమున-నీదుగానమమరియున్న। పూని నీదుశరణన్నవారికను - వీణెతుదంబరఘనస్వరములతో ॥అన్న॥ ఏలనే లక్ష్మి-తల్లిమూలరూపివమ్మ। లీలవేయుకమలాలరాణిఫల మీయువికుంఠపరసుఖమునకై ॥అన్న॥ ఎన్నివేడుకొంటి-తల్లినిన్నువిడువనంటి। ఎన్నిజన్మములకెన్నిదుఃఖములో - ఎన్నియిడుములేనోపజాలనిక॥అన్న॥ ఎంతచిత్రవతివె - నన్నిపు చెంతజేర్చవటవె। పంతమేల నిన్నంతరంగమున - ఎంతుదలంతుభజింతునెప్పుడు ॥అన్న॥ కాశి అన్నపూర్ణ-నీకు దోశిలొగ్గియున్న - దాసుడనుచుపర దేశినైనకృప। జూచిపిలచినను

వాసిగ నేలవె ॥అన్న॥ యోగమందిరమున - తల్లిబాగువెలసియున్న ।
రాఘవేంద్రునికిరాజయోగపదభోగమొసగిననువేగమెకావవె॥అన్న॥

౯౭—రాగం పున్నాగవరాళి చాపుతాళం.

పల్లవి.

నిను వేడితితల్లిననుబ్రోవవె-అంబరావె-నినువేడితితల్లిననుబ్రోవవే ।

అనుపల్లవి.

నినువేడితితల్లిననుజూడవైతివి-ఘనపాపిననుచునీ కరుణదూరమేమొ॥ని॥

చరణములు.

పాలనజేసినీభక్తులరక్షించ । జాలముజేశేవులోలాక్షిరోనేడు॥ని॥ చేసినతప్పులురాశిగొప్పదేమొ - చూచికరుణజేశిదాసినేలవమ్మ ॥నిను॥ కొండెలగూడినేతంటజేశినదోష । మంటికాలునిచేవిల్లంటబడగలేను॥ నిను॥ స్త్రీలమోహములోచిక్కుపడుచునాదు । మూలమెరుగలేకము నిగిపోతినయ్యో ॥నిను॥ పెద్దలదూషించిబుద్ధిలేసిదోష । మొద్దాయముని వద్దగుద్దులోర్వలేను ॥నిను॥ పేదలబట్టినేబాధాలుపెట్టిన । వ్యాధులుబ డలేనుపాదముజేర్చుకొ ॥నిను॥ నమ్మకపలుకుల రమ్మనిసాధుల । సొమ్ము దొంగిలించిరొమ్ముదట్టినదుష్ట ॥నిను॥ పరులద్రవ్యముకోరినరులకష్టపెట్టి। కరుణలేనికర్మమరణమేమొతెలియ ॥నిను॥ బాలభావమున లీలదెలియ నట్టి । బాలులచెవృధకాలముగడిపితి ॥నిను॥ పెక్కుగుణములందు పి క్కటిల్లువిషయ । సొక్కుదెలియలేక చిక్కుపడితినయ్యో ॥నిను॥ దార పుత్రాదులగారవంబుజేశి । చేరినిన్నుగొల్వ దారిదెలియనైతి ॥నిను॥ ఎన్నితప్పులున్నమన్ననజేశినీ । కన్నబుడతబేగినన్నిదజేర్చుకొ ॥నిను॥ని గమవేదిరావెయోగపదముజూపి - రాఘవేంద్రుమొర వేగరక్షింపవె॥

౯౮—రాగం ఆనందభైరవి అటతాళం.

పల్లవి.

దేవినిన్ను విడువజాలనె - అతివేగరావె
భావమందు వదలజాలనె ।

అనుపల్లవి.

దేవినిన్నువిడువజాలకావదేమికరుణబాల ।

రావదేమినిలువజాల-భావమేమొదెలియ(మోాల ॥దేవి॥

చ ర ణ ము లు.

సతిపతులన్యాయమందెగతినిమనముపొందఁట్లు । రతిసిదుది వ్యపదము(వతినిజేసినిలుపవమ్మ ॥దేవి॥ రేయుపగలునీను సేవ-జేయుచుం డనాకువరము|లీయకుండువిధముయేమొచెయ్యివదంబోకువమ్మ ॥దేవి॥ యుక్తియూహలనుబుధులురక్తిజేసినీదుదివ్య । ముక్తిపదముపొందిరట్టి యుక్తినాకుజూపగదవె ॥దేవి॥ నీనుచింతనాదుహృదయ పాదుచేసుకొ న్నవేద । వేదిరావెమోాదమేదెవేదసారరూపిగదవె ॥దేవి॥ చంద్రవదన మునులుయోగనందమందుబిందుకన్య । పొందుజేసిగొందిమోాక్షమం దిరందునిలుపగదవె ॥దేవి॥ కాళినాదుబిందుకళలలీలలమితములునుజే యు । మూలతల్లికల్పవల్లియేలరాదెకరుణలేదె ॥దేవి॥ తారకాద్రిశిఖ రమునధారజారియేరుబార । చేరిజలకమాడినీదు-పరమదరిశనమునుజే తు ॥దేవి॥ కొండబిలమునందునీనునిండుకళనుతెలసుకోని। పండువెన్నె లాదుపరమబండనమునయుందునమ్మ ॥దేవి॥ రండముండలందుకొలువు నుండచేయమనములేమ। చెండినీదుఅండజేరిమెండుసుఖముగొందునమ్మ ॥దేవి॥ వేయుకంబములమేడబాయరానిదేవకన్య । జేయుకొలువుకూట మునజేర్చిబ్రహ్మవిద్యనొసగు ॥దేవి॥ హృదయకర్ణికాంతమధ్యచదరుచే శిమిగిలిమనము । కదసిప్రణవరవములందుకుదురుజేశినిలుపవమ్మ॥దేవి॥ పంచభూతములనుబట్టిఎంచినొకటిజేసినట్టి । పంచధారనొసగినీదు పం చజేర్చియుంచవమ్మ ॥దేవి॥ రావెసర్వలోకజననిరాఘవేంద్రుమొరను చూచి । బ్రోవకున్నదిక్కులేదెభావమందుమరువలేనె ॥దేవినిన్ను॥

౯౯—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

గురుకరుణచే గగనకుంభకంబుననిలచి ।
గురిలేనిహేమపదగుహ్యమునజొరతుఁ ॥

చ ర ణ ము లు.

చిరునవ్వుముఖముచేచిన్నేత్రమధ్యమున - పరమగురునుజ్యోతి ప్రజ్వరిల్లగను । అరుదుగురువీక్షణముఅంతరాళముచించి - అరసికైవ

ల్యాపకమమితమై మెరతుగా ॥గురు॥ కోట్యాదుక్కలనుమీరికోమలంబైన
త్రి కూటమధ్యమునందుదివ్యలింగమునగా । పాటించిబ్రహ్మపదపరమ
హంసనేను - ఘటియించినిర్మైటకదసివెలుగుదునూ ॥గురు॥ అసిప
దంబగునిర్మలానందపదమునై - భసితనేత్రమునందుపరమాత్మయగు
చుగా । వచియించరానిచిదవహ్నిజ్వాలకుమధ్య - దశలక్షణార్యగురు
ధర్మమునమెరతుగా ॥గురుకరుణ॥

౧౦౦—రాగం - కేదారగౌళ.

పల్లవి.

ఇహపరములనుమీరి నెలయుసహస్రారమున ।
మహాలింగరూపమై మహిమ మెరయుదునూ ॥

చరణములు.

దేవాదులకునెల్లదుర్నిరీక్ష్యమైనట్టి - దేవాంతమునయెపుడు తేజరిల్లు
దునూ । భావించిబ్రహ్మబీజముపైని కెలుగిందు - గావించిసత్పదముఘన
మునై మెరతుగా ॥ఇహ॥ ఆద్యంతములులేనియమితమహాజ్యోతి - నా
ద్యంతములునిండినదియెపరమగుచుగా । అధ్యాత్ముడగుగురుని ఆదిబ్రహ్మ
వాంతమున-వేద్యమైనలీలయెపుడువెలుగుదునూ ॥ఇహ॥ మండలత్ర
యములకుమహనీయపరమగుచు - నుండుచుండెడిజ్యోతిమధ్యదేశము
నగా । మెండుకోసివెలిగేటి మెలగులక్ష్మ్యగుచుని అంచు గాయకచిదానం
దమునమెరతుగా ॥ఇహపరములను॥

౧౦౧—రాగం కేదారగౌళ

పల్లవి

మలినమింతయులేక మహోన్నతిప్రపంచేత ।
అలగుజగముల కల్ల అతిపతియునైతిగా ॥

చరణములు.

సూర్యచంద్రులమధ్యసరినిటిభావమున - చర్యనష్టమునైననూ
టిదెలసితిని। శిరముద్వారముదూరిశిఖకళనుగలసిపిం-అరయప్రణవము
నై య్యుహోయిజెందితిని ॥మలి॥ త్రిగుణభావముమీరిదీపస్వరూపమున-
గగనముద్రలోయణువుకారణంబోయగా । భాగ్యలక్ష్మినిగూడిభోగరా

౧౦౪—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

ఇదియె పరమానందమింపుతో జూడశివ ।
పదవికై వల్యమున ప్రబలుచుండుమనుమా ॥

చ ర ణ ము లు.

కన్ను దెరచియు గురునికరవీర్యమునను నిలచి - ఎన్న శివపదమునందె పుడు వెలుగుమనుమా । పన్నగంబును లేపి షట్కుండలితుదను సన్నుతించగ సర్వశూన్యమున మెరతుర ॥ఇది॥ జోడుహంసల బట్టి జాడ నెపోనగ - నిండు పున్నమ బయలు దండి తేజమునర । అండకోని పరమాత్మనతి తుర్యపదమునను - మెండు సుఖవార్ధినై మెలగుచుండుదునుమా ॥ఇది॥ శృంగాటమున నెపు డును వర్ణబీజము కడను - మంగళ ప్రదమైన మహిత తేజమునర । సంగతిని దెలసి నే సారాంశపీఠమున - రంగైన లక్ష్మ్యాంగమున మెరతుర ॥

౧౦౫—రాగం ఆనందభైరవి అటతాళం.

ప ల్ల వి.

ఎందులకు గురుని పాదమొలుక నుండవే - మనస ।

అ ను ప ల్ల వి.

బంధిలకులోనుగాక పరము గోరవే ॥

చ ర ణ ము లు.

సుందరాంగి జాడ జూచి చొక్కియుండవే - మనస - కంమనతో బ్రహ్మ పదము క్రమము దెలియవె ॥ఎందు॥ జాతిభేదములు మాని జన్మమెరుగవే - మనస - పాతకములు ద్రోలి గురుని పంచ జారవే ॥ఎందు॥ నాళమునన మరియున్న నాదమెరుగవే - మనస - చాలు వేయి స్తంభములు చని కెదూరవే ॥ఎందు॥ అష్టదళపీఠమునన మరియుండవే - మనస - నిష్ఠతో గ్గికొన్న గురుని దృష్టిన దలకే ॥ఎందు॥ కుంకుమపువు చాయకుదురు గురుతు దెలియవె - మనస - శంకలేక పరమబైట చేరితిరుగవే ॥ఎందు॥ కోలనుగలను మెళుకు వతోకళను దెలియవె - మనస - అలలిన చిత్సుఖరసమనుభవించవే ॥ఎందు॥ చక్కని చొక్కందు తనువు చిక్కు మరువవే - మనస - మిక్కిలి కైవల్యపదము మెక్కుచుండవె ॥ఎందు॥ జాడపోతులూరుయి యాశ్వరి మేడ జేరవె - మనస - నేడుకతో తి

రువిధిబాబువెంటనుండనే॥ ఎం॥ అసిపదబోధందు మోక్షమమరియుండ వే-మనస-విశదపరచులక్ష్మణార్యుల నేడుకొనవే ॥ ఎదు ॥ రాఘవేంద్రు మొరనుకొనిరాజినొంద వె-మనస- యోగమార్గమున జేరిభోగమందనే॥

౧౦౬—రాగం పున్నాగవరాళి ఆపుతాళం

పల్లవి.

బ్రహ్మబోధ తెలుసుకొనవోయి-ఓయోగిచంద్ర-సద్వివేకపరముగినవోయి

అనుపల్లవి.

బ్రహ్మబోధ తెలుసుకొని నన్నిక చెపరముగనుట -
నెమ్మతినసోహమున్నది - ఇమ్మనమంట ॥బ్రహ్మ॥

చరణములు.

అందముసువర్ణకమల - మందుబింకుపీఠమున - సుందరివర కన్యయున్నది - పొందీనవారి - కిందిసుఖము జెందియున్నది। చిర్బిందుగాదె - మందబుద్ధిలేకయున్నదీ - పొందినఘనులె - బంధమునిడనడినాళిమందిరమునజేరుకొని - జెందినసద్బోధవినవోయి - అందమెకాదా॥ బ్రహ్మ॥ ముప్పురిముమ్మూలకోన- నొప్పిగొప్పసర్పమొకటి- తెప్పనపశ్చిమవీధిని-ఘుప్పునలేచి - అప్పునసహస్రారకుండలిసీ - మెప్పగమంచి-అప్పుడుండెప్రణవవీధినీ-జెప్పినబోధ - కుప్పించివేదసార-చొప్పునజిహ్వనుగ్రోలి-కప్పినమైకాముజెందోయి-ఆరెప్పవిడక॥ బ్రహ్మ॥ ఆరిటిమూడిటిదాటి - కారుబాలలనుమీటి - ఏరులుమూడేకమనవోయి-పరమార్థమందు-జేరిబ్రహ్మలుకువినవోయి-ఆరెంటిమధ్య - ఎఱుకమూలమెరుగరాదోయి-ధరపోతులూర-శేరిబాబులక్ష్మణార్య-దారిదెలసిరాఘవేంద్రు-దూరిపల్కి-నట్టిపరమూనూ-ఆరతీమిగే॥బ్రహ్మ॥

౧౦౭—రాగ కాంభోగి ఆదితాళం

పల్లవి.

పలుకూ ప్రణవమెస్వరములులుకూ-దశవిధనాదం।
పలుకూప్రణవమెస్వరములులుకూ॥

అనుపల్లవి.

పలుకుబలుకుగురుతళుకునేత్రమున - లులుకుచిదంబర

న-సారధారనైయున్నది- ॥బ్రహ్మ॥ అతిరబ్రహ్మమున్నది- మంచిఅ ్షీస్వరూపమైయున్నది । దీక్షత్రయముమీరిదివ్యజ్ఞా నలరు- మోక్షప దిమెనేనన్నది ॥బ్రహ్మ॥ జ్యోతిరూపమైనచిన్నది-మంచిపోతులూరీశ్వరి నన్నది । ఖ్యాతిగతిరువీధిబాబులక్ష్మీసౌఖ్య-కారణపదిమెనేనన్నది॥ బ్రహ్మ॥ సంగీతమైయున్నచిన్నది - మంచిశృంగాటవనములోయున్నది । అంగలింగసంగిబంగారుకొలనులో - గాఘవేంద్రుగుండియున్నది॥బ్ర॥

౧౮౯—రాగం నాదనామక్రియ- ఆదితాళ

పల్లవి.

గురునిభజించవెతుమ్మెద - గురుపరముచేకొందువతుమ్మెద ।

అనుపల్లవి.

సుందళిమునఁనుండితుమ్మెద - నీవుసూటిదప్పకజూచుతుమ్మెద ॥

చరణములు.

గురుసేవజేయగతుమ్మెద - నీకుగురుతుదెలుపుగదెతుమ్మెద । పరమపదముద్రోవతుమ్మెద - మూలప్రణవమంత్రమెకదతుమ్మెద ॥గురు॥ మనసునిలిపితేనితుమ్మెద యోగిమార్గదేశమునందుతుమ్మెద । దినకరుప్రబలునెతుమ్మెద - దివ్యతేజమందున్నదెతుమ్మెద ॥గురు॥ రుద్రవీర్యమదితుమ్మెద - బుద్ధివద్దికలచూడుతుమ్మెద । చిద్రూపమునవెలుగుతుమ్మెద - సర్వభద్రమైయున్నదెతుమ్మెద ॥గురు॥ అనిలమూర్గమునతుమ్మెద - హంసఆటలాడుచునుండుతుమ్మెద । పూనికోటనీలతుమ్మెద - దివ్యపుంజమైప్రబలునెతుమ్మెద ॥గురు॥ ఇడపింగళిమాధ్యతుమ్మెద - బ్రహ్మనాడిప్రబలుచుండుతుమ్మెద । కుండలిశక్తితుమ్మెద - అంకుశముపజేసినిలుపుతుమ్మెద ॥ గురు ॥ ఇష్టవార్ధినుండితుమ్మెద - తేనెఅష్టరేకులజారుతుమ్మెద।సృష్టిభావముదోలితుమ్మెద-జిహ్వాగ్రశ్రేష్ఠమైగోలవెతుమ్మెద ॥గురు॥ గుగుకిళియదెకదతుమ్మెద - వేరెగురుతులేకవెలుగుతుమ్మెద । తుర్యమైయున్నదెతుమ్మెద - సర్వపరిపూర్ణమున నిండుతుమ్మెద ॥గురు॥ పంచకోశములతుమ్మెద - తుదమించివెలుగుచుండుతుమ్మెద । ఎంచి త్రికూటముతుమ్మెద - నీవువంచనచేయకెతుమ్మెద ॥గురు॥ జన్మదేశమున తుమ్మెద - నీవుచూయించుచుండవెతుమ్మెద । తన్మయమదెకదతుమ్మెద - నీకు

తనివితీరనబోధతుమ్మెద ॥గురు॥ సిరిమించుయీశ్వరితుమ్మెద - చెలగిచే రితిరువినబాబుతుమ్మెద । కరుణబోధించిన తుమ్మెద - లక్ష్మణార్యులపద మందుతుమ్మెద ॥గురు॥ రాఘవేంద్రుమొరతుమ్మెద - అదిరాణించిచూడవేతుమ్మెద । యఘములుబాపునెతుమ్మెద - రాజయోగమార్గమునందుతుమ్మెద ॥గురు॥

౧౧౦—రాగం కమాసు - ఆదితాళం.

పల్లవి.

తరుణిగురుజెంతటివాడే ।

అనుపల్లవి.

ఎంతటివాడేయెంతటివాడూ ॥తరుణి॥

చరణములు.

గురుపాదములమూర్ధ్నబెట్టితీ - గురుసేవపూజలుజేసితీ । హరుని వరములియ్యకోరితీ - వెఱపులేనిపదవిజెందితీ ॥తరు॥ తీర్థప్రసాదము లిచ్చెనే - తెలినితోసనుదయజూచెనే । భూతిబూసిజోకొట్టెనే - పుణ్యస్థానమునందునిలిపెనే ॥తరు॥ మంత్రపిండమునునుజేసెనె - మాయపిండమువుంటగల్పెనే । తంత్రవాదితలద్రుంచెనే - ధర్మబయలందుంచెనే ॥ తరు ॥ జున్నుతేనెలపంచధారకూ - ఎన్నశక్యముగానిరుచులకూ । కన్నచోటనుండుధారకు - కలిగిమాగురుడిచ్చినందుకూ ॥తరు॥ పున్నపువెన్నెలచెంతకూ- పుడమివిలక్షణబోధకు । సన్నదిక్షదూరినందుకు- సంతోషమరయుటనందుకూ ॥తరు॥ అఖిలస్వరూపప్రదీపము - ఆత్మరామునికొలువుజేసెము । వికసితయీశ్వరిపాదము - విఱివినమ్మియున్నవారము ॥తరు॥ పాలనజేసీసధర్మము - బాబులక్ష్మణులయోగము- మేలుతెలసిమదిజూచెము - మెఱగురాఘవేంద్రువాక్యమూ ॥తరు॥

౧౧౧—రాగం కమాసు ఆదితాళం.

పల్లవి.

తరుణిసద్గురుబోధే ।

అనుపల్లవి.

సద్గురుబోధెసద్గురుబోధ ॥తరు॥

చ ర ణ ము లు.

కలికిముద్దులగుమ్మకోరినట్టి - కనుచూపులో మేలుదెలసినట్టి । సులకననుక్షేత్రమార్గముట్టి - సూటిదప్పకజూచుచుండినట్టి ॥తరు॥ పండువెన్నెలబైలుపంజరం - బల్ సుందరము చిలుకపల్కులుం । గండుతుమ్మెదలరోదనం - కడువిచిత్రమైనచోటునట్టి ॥తరు॥ కప్పుకోడికూతకూశినట్టి - కరకంతునెళవెరిగియుండినట్టి । అప్పుడుం సుప్రణవస్థానముట్టి - అలరుచుండుసుఖమందినట్టి ॥తరు॥ పాలతిచెయ్యిపక్కయుండినట్టి - పొందుజేసినమేలుదెలసినట్టి । వలపుమరుపులేకయుండినట్టి - వాడె వరయోగనునుండినట్టి ॥తరు॥ దర్శినుండు ధర్మమార్గముట్టి - తనలోమెలగుగురుసూత్రముట్టి । చెరుపులేనిశుద్ధతీర్థముట్టి - చేరిజిహ్వాగ్రోలమోదముట్టి ॥తరు॥ సకలకృత్తులుజేయుచుండినట్టి - నాగసర్పముబట్టియుండినట్టి । కుక్కనుగురిబట్టిజూచినట్టి - కులుకులాడియెదుటనిలచినట్టి ॥తరు॥ ఆలనపాలనజేసినట్టి - అఖిలస్వరూపముదెలసినట్టి । కాలమంతు దృష్టినిలిపినట్టి - పరబ్రహ్మమునుచాయపొందినట్టి ॥తరు॥ బాలకన్నెరసముతాగినట్టి - బల్ కైపులో చొక్కుచుండినట్టి । లీలపోతులూగుతెలసినట్టి - లాలితంబగుస్వాయమందినట్టి ॥తరు॥ పరమబాబు లక్ష్మణార్యులే - పదవులిచ్చినసుఖరూపులే । అరయు రాఘవేంద్రుపల్కులే - ఆనందమగుముద్దుధారలే ॥తరుణిసద్గురు॥

౧౧౩—రాగం భైరవి అటతాళం.

ప ల్ల వి.

మొరచిన్నపోకటుందిమోదించివనవలె మొరచిత్రమవునురరామా -

అ ను ప ల్ల వి.

కరుణనిదయవుండకంటిమధ్యనుమేలు కనుగొంటినుకటిరరామా ॥

చ ర ణ ము లు.

చిత్రకూటంబదియుచిద్విలాసంబులును చోద్యమైయుండిరరామా । పాత్రమునపైనుండుసూత్రమెరిగినవారి గాయత్రిమూలమదిరామా ॥మొర॥ ముదితవిహారములకుమూలబీజముపైని మెలగుచున్నదిసౌజ్ఞరామా । సదమలంబెనట్టి సాయుజ్యపదమునది సారమైయుండిర

బ్రహ్మ - నాళముంమనమరజేసికోడెతానుపడిగెలేచినిన్ను తెరచికమలము
ధ్య ॥రస॥ అనలఅనిలమూ - గూర్చిఅమలయోగము । ప్రాణమునుబ
ట్టిపశ్చిమాసదిశనుతేపిసహస్ర - స్థానమునసోహపము సారమమరియు
న్నగృహంలో ॥రస॥ అమృతబీజముల్ - రెండుఆరురూపముల్ । సమ
రస్పైక్యంగోఘనొందసారమండలముజెంది - యమితతురీయపదమునంది
యలపబ్రహ్మకమలమందు ॥రస॥ జయమునున్నదీ - భక్తిస్వాయమున
న్నదీ । నయనభాగమునవెలుగు - మయముబాల లక్ష్మణాఖ్య - జయి
లుంగోనమోహపపవిబయిలుపరచినట్టిబ్రహ్మ ॥రసమ॥

౧౧౪—రాగము సౌరాష్ట్రము ఏకతాళము.

పల్లవి.

గురువుచేయున్నదిగనితుతెలియపెమనసకూడియుండను ।

అనుపల్లవి.

కరుణావశమినభక్తపాలకుయిదిమూలకలిమియుండెను ॥

చరణములు.

కల్పవృక్షమూఘనిసునులకుధర్మముకలిగియున్నది । అల్పమతు
లకెల్లయునుధమునకొసిలియున్నది ॥గురు॥ పరముజేరచోరపడియు
న్నమహాస్వామునుపట్టుకోండి । పరసిగురుమూర్తిసెంపుతీసుకొనిజేరుకోండి॥
గురుచిరునప్రభముగానువిలకిపలుకులందుచిత్రమున్నది । సరకతేలి
యదానిసామములోమేలుసోహమున్నది ॥గురు॥ కమలమధ్యమునందు
ఘనసూత్రమునసింహపకసనెలియుడి । అమలపరంజ్యోతి ఆనందరూపమై
ఆడుకోండి ॥గురు॥ యమలతేసివెలుగుయేగుమక్కున్నది వెతుకుకోండి ।
అల్లమహాగ్రమునాయుడాదిపీఠమునఅమరుకోండి ॥గురు॥ సుఖమున్నచో
టునసూర్యప్రభనుమీరసజూచుకోండి । యఘములుబాపిన యాత్రరా
మునికొలువుయెరుగుకోండి ॥గురు॥ చింతమానిలోనుచీకటిమధ్యనుసిరిని
యున్నది । వర్తిలేనిజ్యోతివెలుగు ప్రబలమైనసత్తుయున్నది ॥గురు॥ న
డులుమూడుజేరినాళమందునపరమునమరియున్నది । బుధులకెల్లకోటి
పుణ్యనదులఫలముపొందియున్నది ॥గురు॥ ఆదిపోతులూరు నమరియా
శ్వాసిపదమునధికమున్నది । బోధించుతిరువీధిబాపనార్యులయొద్దబోధై

అనుపల్లవి.

కొట్టరఅంతస్సులోపలకట్టరయీమనసుఇపుడు ।
పట్టరపద్మంబులోపలపట్టితిబ్రహ్మాంబుననుచు ॥కొట్ట॥

చరణములు.

మూటిమీదనుముక్తికాంతను భాటదప్పకభక్తిచేతను । నూటిగసురులంతజేరినచోటుదెలసిసాటెదనుచు ॥కొట్ట॥ నళిములారిటుమీరియీవలకళినుదెలసిబిలములోపల । వెలయుసహస్రారబిందువువెలుగుచుండెనాదజ్యోతని ॥కొట్ట॥ హాయికినిగాయత్రిమంత్రము స్థాయిజేసుకరెంటిమధ్యను । బోయిఆపోజ్యోతిబ్రహ్మకాయమెస్థిరమనుచునెప్పుడు॥ కొట్ట॥ అండపిండబ్రహ్మాండములుతా నిండుకొనియేకంబుచిత్కళి । పండువెన్నెలబయిలుగనినేనండబాయకనుంటిననుచు ॥కొట్ట॥ జయము పోతులూరియీశ్వరిమయముబాబులక్ష్మణార్యుల । నయముదీసుక రాఘవేంద్రుడుస్వయమునందానందమందెని ॥కొట్ట॥

౧౧౭—రాగము మోహన ఆదితాళము.

పల్లవి.

సురదాగివలెరా - సుస్థిరమతులై - సురదాగివలెరా ॥

అనుపల్లవి.

సురదాగవలెరసారముదెలియవలెర -
ధారణయోగులకునెల్లధర్మమైనపదవి ॥సు॥

చరణములు.

కోనయున్నదిరా - కోనకునడుమవనయున్నదిరా - వనముమధ్యనువిమలమగువరజ్ఞానజ్యోతివెలుగుచున్నది - మేనుమరచిమూటిదెలసితానుతరచిధర్మపదవి ॥సుర॥ ముయ్యేటిలోనూ-ముచ్చటైన - తియ్యనిజలమూ- వేయురేకులవీధినుండివెలయుచునుదిగజారమధ్య - అయ్యలందరుదృష్టిచదరికసయ్యసీపానంబుజేసె ॥సుర॥ కోటయున్నదిరా -కోటకులోన - పేటయున్నదిరా - పేటలోపలపుట్టతేనెలుబట్టవానిదిట్టనెరిగి - పట్టుగనందున్నయోగలుఘట్టిగకాటందకనుతా ॥సుర॥ వృక్షమున్నదిరా-వృక్షమునందు-పక్షులున్నవిరా । పక్షులురెండేకమైతెరచికి

రైవేఁ పేనాడు - చక్షుస్థానమునందుమరిప్రత్యక్షమైప్రవహించునట్టి ॥
సుర॥ రామరామనుమీా-పృథివినందు-ప్రేమతోవినుమీా । సామజంబు
లుమె ౦మిదింటిసోమసూత్రమునందుగట్టి-ప్రేమతోభుజియించినట్టి రా
మమై ంముఁజెందినట్టి ॥సుర॥ అందమైనదిరా-నాళముఁనందు- ఆపోజ్యోతి
యుఁగం । బృందనాదముఁఘోషచేమరిజెందిపశ్చిమవీథికెగసి- పొందిన
హంసమంత్రమునందమగుహంసోహమనెడి ॥సుర॥ భక్తికైనదిరా- భా
వముఁనందు - ముక్తికైనదిరా । భక్తిముక్తులుపరముతానై శక్తితోవె
లుగఁ ంచుచుండె - రక్తిమార్గముచేతజిహ్వాలిరక్తిధారనుజుర్రినట్టి॥సుర॥
పోతులూరుసురా-ప్రాభవమైన-మాతయీశ్వరిరా- జ్ఞాతలగుపరబాబు
లక్ష్మిణీతిదెలసినధన్యులకుమరిపాతకములుపడగ జన్మపరమపదమును
జేర్చినట్టి॥ సురదా ॥

౧౧౮—రాగము తోడి అటతాళం.

పల్లవి.

అంతనీవుబ్రహ్మమయమెగ-సద్గురుమూర్తి - వింతలాయమదికిజూడగ॥

అనుపల్లవి.

అంతనీవుబ్రహ్మమయమె-అమగికమలమంట జ్యోతి -
విమలమైనదృష్టికుదిరివిధము తెలసుకొన్నవారి ॥కంత॥

చరణములు.

వాచబ్రహ్మమనుటయేమివదగదదియువస్తుగాదు - వాశిడశమ
నేత్రములోవనగుబాలతెలసువారి ॥కంత॥ జారిచోటులన్నిమడినిసర్వదృ
ష్టినొకటిజేసి -మేరుపదమునంటుకొనిమెలగుసుఖమునున్నవారి ॥కం॥ కా
మమునుబట్టినిష్కాములైనవారునాభి-కమలమధ్యవెలుగుచున్న కళను
దెలసుకొన్నవారి॥ కంత॥ భక్తియోగమునునిలచిరక్తిమార్గమునదలచి-
ముక్తికన్యపొందుజేసిముదముజెందియున్నవారి ॥కంత॥ ఆరుచక్రముల
హంసజేరితిరుగుదారిదెలసి - మేరుకుండలినిహంసమలయుసోహమను
రెవారి॥కంత॥ వెలుగుపోతులూరుపదమువెలుగు యీశ్వరాంబకళలు-
వెలుగుబాబులక్ష్మణార్యవెలుగుజూచుకున్నవారి॥కంత॥

౧౧౯—రాగం భైరవి అటతాళం.

పల్లవి.

రసముపానముశాయవలెనూ-మనసుంచి తెలసిమరి పండవలెనూ

అనుపల్లవి.

రసముపానముజేసి రామధ్యానముయెప్పుడ -
పొసగిముమ్మూలలోముసుకుదీసియమృత ॥ రస॥

చరణములు.

అంటిఅంటనిపదవికోరి - ఆరెంటినడుమనుస్ఫ్రష్టికుదిరి - కోం
శుగాంళినుబట్టికోటి మధించి మదివెంటదిసుగుచు నెప్పుడుయేకాపుర
ముగూడి ॥రస॥ గండిలోపలగండిజెందీ - అఖండభాగ్యముచాలపొంది -
మొండుగ వెలిగేటిమేటిసద్గురుపదము - అండబాయక యెప్పుడుఆనందసా
గరగా ॥రస॥ స్త్రీలుపురుషులుగూడుకోనీ- నడుమస్వప్రకర్తను దెలసుకో
నీ - చల్లమీదనుసిగ్గుసఖయదీనెయ్యగ - మెల్లనేయారీతిమెలగుచును
మతియెంచు ॥రస॥ పోతులూరిలోనీతిపొంది । ఆమాతయీశ్వరి పాద
మందు-పతితపావనులై నవాబులక్ష్మణపదవి - మతిరాఘవేంద్రుడుమరి
గ్రోలుచున్నట్టి ॥రసము॥

౧౨౦—రాగం ఆనందభైరవి అటతాళం.

పల్లవి.

ఏటికేజన్మమేటికే-కాటికిగాక-ఏటికేజన్మమేటికే ॥

చరణములు.

కోటిపాతకములదూరికాటుబడుటెగాక శ్రీ - మేటి సద్గురునిపద
ముపాటబాడలేనిజన్మ॥మేటి॥గాలమునజిక్కినట్లుకాలయమునిచేతిపట్ల -
ఫాలమందునబ్రహ్మసూత్రముమేలుదెలియలేనిజన్మ ॥మేటి॥ బ్రహ్మవేత్త
లమనుమలోకభ్రాంతులువిడువంగలేక - నిర్మలసుజ్యోతిపాశనిలకడలే
నట్టిజన్మ ॥మేటి॥ కుమతుబుద్ధులుచాతబట్టుకకులముగురుకులవారమను
చు - నమరినానైనయనసూత్రము నాణెముదెలియనిజన్మ ॥మేటి॥ అం
గలింగముమధ్యవెలిగెయమితమాహాజ్యోతిదెలియక- దొంగముచ్చుల
వేషములబింగిపలుకులబలుకుజన్మ॥మేటి॥ సాధుసజ్జనపలుకులుకడుమో

కోటిసూర్యకాంతిమాపూరు । అదికొమరొప్పుచున్నదిమాపూరు॥ఏపూ॥
సన్నబిలములోనమాపూరు । అదివున్నతమైయ్యుందిమాపూరు॥ఏపూ॥
ధారపాత్రమయ్యమాపూరు । అదిధర్మముదెలిసేరుమాపూరు ॥ఏపూ॥
కుక్కగుణములకుమాపూరు । అదికొక్కరించునయ్యమాపూరు॥ఏపూ॥
రెండుఇండ్లనడుమమాపూరు । అదిమెండుగవెలిగేదిమాపూరు॥ఏపూ॥
చిన్నచిఱుతలకుమాపూరు । అదిచిక్కేదికాదయ్యమాపూరు ॥ఏపూ॥
పుణ్యతీర్థమయ్యమాపూరు । అదిధన్యులుయెరిగేరుమాపూరు ॥ఏపూ॥
అంటిఅంటకుండుమాపూరు । అదిఅంటితెముక్తిచ్చుమాపూరు ॥ఏపూ॥
సాటిపోటిలేకుమాపూరు । అదిచోటెరుగరాదయ్యమాపూరు ॥ఏపూ॥
అగ్నిగుండమయ్యమాపూరు । అదిఆర్యులుదెలిపిందిమాపూరు ॥ఏపూ॥
నిష్ఠలేనివారిమాపూరు । అదిభ్రష్టుజేసునయ్యమాపూరు ॥ఏపూర॥
సోమసూర్యులనడుమమాపూరు । అదిసోమరసమొకదమాపూరు॥ఏపూ॥
మింటిమంటినడుమమాపూరు। అదివొంటుగవెలిగేదిమాపూరు ॥ఏపూ॥
మునులసంగమయ్యమాపూరు । అదిమొనసివిస్తరిల్లుమాపూరు॥ఏపూ॥
దీక్షత్రయములకుమాపూరు। అదిమోక్షపదమెనయ్యమాపూరు ॥ఏపూ॥
హరిహరాదులకెల్లమాపూరు। అదిఆధారమైయ్యుందిమాపూరు ॥ఏపూ॥
యెండనీడలేనిమాపూరు । అదియేగుదెలియరయ్య మాపూరు ॥ఏపూ॥
వత్తిలేనిజ్యోతిమాపూరు । అదియెత్తునయున్నదిమాపూరు ॥ ఏపూర ॥
యక్కడయున్నదిమాపూరు। అదిదిక్కుదెలియరానుమాపూరు ॥ఏపూ॥
వేదసారమయ్యమాపూరు । అదివేద్యులుయెరిగేరు మాపూరు ॥ఏపూ॥
నదులుమూడుచేరిమాపూరు । అదినాణెమైయున్నదిమాపూరు ॥ఏపూ॥
ఏమియెరుగదయ్యమాపూరు । అదిఎఱుకకుతెలియదుమాపూరు॥ఏపూ॥
చిక్కుకోనలోనమాపూరు। అదిమెక్కువైయున్నదిమాపూరు ॥ఏపూ॥
రక్కసులకెల్లమాపూరు । అదిచిక్కనిపదమయ్యమాపూరు ॥ఏపూర॥
రాజహంసలురెండుమాపూరు । అదిరాజీనదిరుగునుమాపూరు ॥ఏపూ॥
కాలసర్పమయ్యమాపూరు । అదిఘనులుబట్టేరయ్యమాపూరు ॥ఏపూ॥
బిందుపీఠమునమాపూరు । అదిపొందికయున్నదిమాపూరు ॥ ఏపూర ॥
బయిలులోకుబయలైనమాపూరు । అదిబయలెబ్రహ్మమయ్యమాపూరు॥

సారపోతులూరుమావూరు। అదికార్ణబాబయ్యమావూరు ॥ఏవూరి॥
రక్షణపదమదిమావూరు । అదిలక్ష్మణాగురుడయ్యమావూరు॥ఏవూరి॥
రాఘవేంద్రునికిమావూరు । అదిరమ్యమైయున్నదిమావూరు ॥ఏవూ॥

౧౨౩—యాలలు.

నాకన్నవాడనినిన్ను నే-చేకొన్నసద్గురుపదము । ఆకొన్నని ర్మల జ్యోతినీ - ఓలక్ష్మణార్య - నీకన్న జేర్చెవా రెవరురా ॥౧॥ రెంటిమధ్య వెలుగుచున్నదంటినాపో జ్యోతిజాడ । మింటిగాయత్రిస్థానమురా-ఓల క్ష్మణార్య - అంటిసోహమందెసిలిచేరా ॥౨॥ తెల్లనికొంగ నొక్కటిపుల్ల మలగికొలనుజేరి । అల్లమేరువెక్కిజూచెరా - ఓలక్ష్మణార్య - కొల్లలు గసుగ్రుముజెందెరా ॥౩॥ గురుమల్లెతోటలోపలపాలమల్లెహంసలురెండు। సారమల్లెవాసనదెలిశెరా - ఓలక్ష్మణార్య-పరమామల్లెసదియెనిలిచేరా॥ ౪॥ సద్దులేనిపెద్దయేటివద్దనుండిసర్పమొకటి । బుద్ధిమంతులైనబట్టేరూ ఓలక్ష్మణార్య - కస్తురిర్వముందె నిలచేం॥ ౫ ॥ పారవారమని యేటి స్వరముజేరి పరమపైట । నిండుకోడినిండి ప్రబలేరా - ఓలక్ష్మణార్య-అ రయుపూర్ణ భావమిదియేరా ॥ ౬॥ ధర్మపురిలో బయిలున్నదిమర్మమె వరికెవిగాదు । ధర్మరాజు దారిజూపెనూ - ఓలక్ష్మణార్య - నిర్మల మెనీలజ్యోతిరా ॥౭॥ శునకమొకటిపరుగుబారీ - మణికేశ్వరిరావుజేరి- సోనగురి యస్థానమమరెరా - ఓలక్ష్మణార్య - తానులింగమయిమైప్ర బలెరా ॥౮॥ ఆకులేని మాకుమీంద సూకరము ఊర్ధ్వమెరిగి । ప్రకట భక్తిని నిలచెరా - ఓలక్ష్మణార్య - రాకపోకలందెగిట్టెరా ॥౯॥ నాడ గజము మహిమమీరి - సుదతిపొందుశాయగాను - ఉదితమాపోజ్యో తిప్రబలేరా । ఓలక్ష్మణార్య - వేదవేద్యులని బలెరా ॥౧౦॥ ఘట్టగి ట్టలేనిచోట పుట్టినబ్రహ్మాండమంత । పట్టబోతె పసయేలేదురా - ఓల క్ష్మణార్య - ఇట్టిమహిమ లెన్నవశమేరా ॥౧౧॥ సాటిలేని మర్రిమీంద కోటిసింహములున్నావి । మూటిబట్టనన్ని నిలచేగా - ఓలక్ష్మణార్య- పేటుపైన నేనేమెరిశెరా ॥౧౨॥ పండుపండిపమిడిభర్తులుండగా దన జేరి । పండురసము పానమందెరా - ఓలక్ష్మణార్య - యుండుజగమూ న్నిమరిశెరా ॥౧౩॥ అన్నరాత్రిపోతులూరు - విన్నారపీరుగురుని-కనా

రయీశ్వరిపదమునూ - ఓలక్ష్మణార్య - మున్నార క్రకూటభావమూ ॥ ౧౮ ॥ మూలాధారమూనబాబు । కీలుదెలిపె లక్ష్మణగురుడు। గీలబయిలై పరమూదెలిసెరా। ఓలక్ష్మణార్య।యాలలునీ వ్నవించెరా॥౧౫॥

౧౨౪—మంగళహారతి.

అంబనీకుయిదుగో మంగళం - శంభునిరాణి దేవినీకుయిదుగో మంగళం ॥ అంబనీకు మంగళముడింభను పరివేయు కమల- రాంబ్రబహపదము నందాంబ ఆనందశోభి ॥ అంబ ॥ సుందరాంగి చూడ సోద్యమూ-శతవరషమూలు - బిందురాంతరాళ మధ్యము-పొందలేకనిన్న బ్రహ్మానంద తపము నరసిమూల । మంపునాభి కవ లమునజెందిజూచె నీప్రకాశ ॥అంబ॥ రెంటిమధ్య వెలుగుచున్నవు - నడినాళమందు నంటి బిందు ప్రబలుచున్నవు । జంటనాగ స్వరముతోడ బంటిపరమ హంసనా - రింటిచక్రదళములను నంటిప్రజ్వరిల్లుదేవి ॥అంబ॥ రూపములో రూపమైనవు - నిరూపమంపు - రూప సర్వశూన్యమైనవు - రూపనాదజీజకం రూపకళలు విస్తరిల్లి । రూపసర్వలోకములకు రూపదీపమైవెలంగు ॥అంబ॥ అగ్నిబీజమ మరియున్నవు - గురుపోతులూరు - భర్గోనిగమసారమన్నవు - భర్గబాబు సహస్రయోగ నిస్గుణుండు లక్ష్మణార్య । మమరుండు పరముదెలిపె - స్వర్గసారనాక్షియనగ ॥ అంబనీకు యిదుగో మంగళం ॥

౧౨౫—లాలిపాట

లాలిమగ్గను వర్యలాలి జగదార్య - లాలిశ్రీలక్ష్మణార్యలపదివినెల్లా ॥ లాలి ॥ చూడసోద్యంబైన సుందరపుమేడ - గండిలోపలకమలమధ్యమునజూడ । పండువెన్నెల బయిలుపరము రంజిల్ల - పొగడుచుంపరె భక్తవరులుల్లసిల్లా ॥లాలి॥ సీతాంశుపీఠమున శ్రీలక్ష్మితోను - ఖ్యాతిగ గురుమూర్తికలసియుండగను - పీతవర్ణంబుననుప్రజ్వరిల్లగను - ప్రియముతో చెలులెల్లచేరి కొల్వగనూ ॥లాలి॥ సురలోకముని వర్యసూక్ష్మరూపమున - సర్వమును వెలుగుదువె సాక్షిరూపమున - మొరసేయు శృతులందు మొదటి రూపమునా - మెలగుచుందువెబ్రహనాళ పరిపూర్ణ ॥లాలి ॥ నాడిద్వయములమధ్య నాటకునిజూ

చి - నాడుచుండగ హంసలీలను తెలసీ - పడియున్న కుండలినిపై కెత్తి నొక్కి - పరమ సుజ్యోతిరసపదవి జుర్రాడీ ||లాలి|| దేవాదులకునెల్ల దేవ హెయ్యున్న । దేవియీశ్వరి పదము తేజమైయ్యున్న - భావింపతి రుషీ బాపనార్యన్నా - పదవిలక్ష్మణగురుడు ప్రబలమైయ్యున్నా ||లాలి||

## ౧౨౭ — మేలుకొలుపు.

జీవనీవచ్చినతావు తెలసుకొన్న జీవబ్రహ్మైక్యమునీవెకా - జీవచిక్కులేని దేవభావమందు జీవితేశ్వరుడ వీవెకా ||జీవనీవెకా|| ఆనందజలధిలో వాలలాడుచున్న - ఆపోజ్యోతికళనీవెకా - జ్ఞానాంజనము చేత కనుగొన్నవారికి - కుండలిస్థానమువీవెకా ||జీవనీవెకా || ఇడపింగళ మధ్య విరివిగ వెలుగొన్న - జాడనీవెయని అంటెగా - యేడుమేడలమీద యేకమైయున్నట్టి కోడెతానుమీద వీవెకా || జీవనీవెకా || కొండలేడు దాటమండలత్రయమున మండుచుండెటి జ్యోతినీవెకా - అండజేసువారి కానందనార్థిలో అంబరవీధిని వీవెకా ||జీవనీవెకా || సర్వధర్మముల సారమైయ్యున్నట్టి - సర్వేశయాబ్రహ్మనీవెకా - కరుణచే భక్తులగాచి రక్షించిన కరికిం త్రపాణివీవెకా ||జీవనీవెకా|| పండువెన్నెల బైటపరమునై వెలిగేటి - భానుమండలపతినీవెకా - మెండుగ త్రికోణబ్రహ్మమండలమందు - నిండుకొన్న వెలుగువీవెకా ||జీవనీవెకా|| సాధనములకెల్ల సాధనమైయ్యున్న సాధుసజ్యోతి వినీవెకా। భేదమెరుగనట్టి బ్రహ్మవేత్తలకు బ్రహ్మానంద పదవివీవెకా ||జీవనీవెకా||అందుయిందు చాలయెందుజూచినను పొందికైయున్నాది నీవెకా - మందారపీఠము మహిమనుండుబిందు - మర్మ మెలసిన వీవెకా||జీవనీవెకా సాహసమునజూడ సన్నబిలములోన - సోహపదమైయ్యున్ననీవెకా - మోహముదేసట్టి మోహజ్ఞానులకు మురలీడుచున్నట్టివీవెకా || జీవనీవెకా|| యజ్ఞగుండమందు । పజ్ఞాన బ్రహ్మము సుజ్ఞానమైయ్యున్ననీవెకా - భర్గోదేవశ్యని పలుకువేదములు । పరమైనవారికి వీవెకా|| జీవనీవెకా|| ఆదిపోతులూరు యీశ్వరిపదమున - అమితమైయ్యున్నాది నీవెకా - భేదించిబోధించుబాబులక్ష్మణార్య బ్రహ్మబోధయెందువీవెకా||

౧౨౭—మేలుకొలుపు.

మేలుకొను సురలోకవర్య - మేలుకొను శ్రీలక్ష్మణార్య - మేలుకొను నాదివ్యదృష్టిని మేలుకొనవయ్యా ॥గురుపతీ మేలుకొనవే॥ బ్రహ్మమూలమునంటి కమలము ప్రజ్వరిల్లగ నూర్ధ్వవాకిట - యిమ్మునను శతకోటిభాస్కరువిధమునను వెలుగుచున్ । హుమ్మకొని జలవార్ధిమధ్యప్రపన్నులు దయముచిత్రచోద్యము - సమ్మతిని గైకొన్న ప్రమధులసారమండలమూ ॥గురుపతీ మేలుకొనవె॥ చూడఘనపది చంద్రమండలకండి సుకమార్గంబుజేరుక - నుండుగిరిపై మెండుగ వములునిండి మోవగనూ - అండకొని ఆరెంటి మధ్యను పుండరీకమునందు హంసము- దండిప్రణవజ్యోతి వెలిగే తారమండలమూ ॥గురుపతి మేలుకొనవే ॥ పరమజ్యోతై ప్రజ్వరిల్లెడి పదమునందమరాది మునివరుల రవజలములనేత్రధారలు యమితమును గురియన్ । వరుసపంచాక్షరిమూలము వేదవేద్యంబైన సూక్ష్మద్వారమున ముదమంది చెలగెధారమండలమూ గురుపతి మేలుకొనవే ॥ తారకాద్రిశిఖరమున కళతరు చువ్వురుములు మెరుపుచిత్కళ - లరుదుఘనచిత్పదమునందు నయమితమై మందుగ-పరమసుఖరసభరితమగు ప్రాపూర్ణ్యపదమై నిండి వెలగెడు గురుకులోత్తముల మరియుండిన జ్ఞానమండలమూ ॥గురుపతి మేలుకొనవే॥ అలరుగు పపదములరు సద్బిలములరు నిర్బయిలందు వెలిగే। కులుకుప్రణవజ్యోతి నిరుసునకలికి వికసించెగా - తళుకుబెళుకులు తారతమ్యము లులుకుచు [illegible] కొనమెలుకువను గైకొన్నసిద్ధులమహిమమండలమూ॥ గురుపతి మేలుకొనవే ॥ సన్నదిడ్డిని వున్నతంబగు పున్న పేన్నెలనందుగు [illegible] చిద్బిందు ఛిన్నయమన్ని తానిండెగా - యన్న శివపదమున్నచోట ప్రపన్నుల ద్వయభావమదిచే । కొన్నతన్మయ మోక్షమగు త్రికోనమండలమూ ॥గురుపతి మేలుకొనవే॥ అంతరంగమునందు వెలిగేయమితపోతులూపయీశ్వరి - ఖ్యాతిగ వెలుగొందుతిరువిధిభావనా ర్యాఖ్యగా - మతముమూలము మహిమ దెలిపిన మద్గురుండగులక్ష్మణార్యుల - వ్రతముచే విహరించు నిర్మలయోగమండలమూ ॥గురుపతి॥

—*(చుండూరు రాఘవయ్యగారి శిష్యులు)*—

పూర్ణానందస్వామి జెప్పినకృతులు.

౧౨౮—రాగం నాదనామక్రియ అటతాళం.

పల్లవి.

కనుగొంటినయ్యా - మద్గురుపాదం - కనుగొంటినయ్యా॥

అనుపల్లవి.

కనుగొంటినయ్యా యాకమలనాభునినాదు -
హృదయకమలమందువుప్పొంగుచున్నట్టి ॥కను॥

చరణములు.

ఆదిఅంత్యములేని ఆకాశమునుజేరి - మోదమలరుచున ము క్తిస్థానమునందు ॥ కను ॥ చంద్రసూర్యనాడుల్ సహజముతో దిద్దుగ- అంటుజేరినే నానందమునుపొంది ॥కను॥ సోహంభావమొంది సొలయగ పవనుని - కుంభకస్థానానగూడి తన్మయమందు ॥ కను ॥ ఆరుమెట్లు దాటి అంబరమునుజేరి - ముగురుమూర్తులకు మూలమైనప్రణవం ॥ కను॥ సగుణనిర్గుణములకు సాక్షితోనున్నట్టి - నిగమాంతవేద్యమునిం డినచోటనే ॥కను॥ అవస్థలమూడిటికందక వేరునై సహస్రరేకులమధ్య ముననిలచినే॥కను॥రూపునామక్రియలురూపింపరానట్టి-విశ్వమంతయు నిండి వెలగిచిన్మయమొంది ॥కను॥ సుందరమగు పోతులూరులో వెల సినయిందిర యీశ్వరియినుకోటితేజము ॥కను॥ ఫాలభాగమునందు శా బులక్ష్మణపదవి - రాఘవేంద్ర గురురాయుడుండినచోటు ॥కను॥.

౧౨౯—రాగం మోహన త్రిపుటచాపుతాళం.

పల్లవి.

యోగినేపరమయోగినే - అద్వైతవైభవ। యోగినేపరమయోగినే।

అనుపల్లవి.

యోగినేనాధారకమలమునన్నియునుదాటుకొని -
వేయురేకులవీధియందు వెలగుసోహముగన్న నిర్గుణ ॥యోగి॥

చరణములు.

చెందితి నాలోపొందితి - చిన్మయ బ్రహ్మము - జెందితి-నాలో

పొందితి । జెందిచిదాకాశమునచిన్మయరూపమున(బు - నిండివెలిగె
(ప్రణవమునసేనండజేరియేకమైన॥యోగి॥ఉంటిసీ-నాలోసేకంటిసీ-ఆనం
దమయుని-వింటిసీ-నాలోసేకంటిసీ । వుంటినిఆకాశమునవిర్విషయమైన
మాయదాటి - అంటిఆపోజ్యోతికళసే నంపునైక్యముగన్నచిన్మయ ॥
యోగి॥ అందమూ-చిదానందమూ-పరిపూర్ణబోధ -అందమూ-చిదా
నందమూ । అందముయిందందులేకనన్నిదిక్కులుఏకమైతా - పొంది
వెన్నెలలోనయీశ్వరిబాలనుకనుగొన్నకేవల ॥యోగి॥ ఏకమూ - (బ
హ్మావలోకమూ-అద్వైతమందు-యేకమూ-బ్రహ్మావలోకమూ । ఏకము
తనలోనె(ప్రకాశమైవెలుగొందుకుండలి - పాకమెరిగిబాబులక్ష్మణపదవి
నందానందమొందిన॥యోగి॥ ఆయనే-తనలోతానాయనే-స్వయంజ్యో
తి-ఆయనే-తనలోతానాయనే । ఆయనేపరమాంతరంగస్థాయనే గురు
రాఘవేంద్రుడు - డాయనేపరమార్థమిదినాకాయనేయానందమొదవిన॥
—(మండూరురాఘవయ్యగారిశిష్యులు రంగమ్మగారుజెప్పిన కృతులు)—

౧౩౦—రాగం కాంబోది త్రిపుటతాళం.

ప ల్ల వి.

ద్వారకపురమందుఘోరనై వెలింగేటిరాఘవేంద్రా ।

అ ను ప ల్ల వి.

దారిజూపినన్నుదరిజేర్చరతండ్రిరాఘవేంద్రా ॥

చ ర ణ ము లు.

మోహపాశములమోసపోయిమునిగితిరాఘవేంద్రా । మోహ
పాశమూలుమొదలంటద్రుంచర రాఘవేంద్రా ॥౧॥ సంసారమునజిక్కి
చాలకష్టించేనురాఘవేంద్రా । కంసవిభంజనకరుణనాపైనుంచు రాఘ
వేంద్రా ॥౨॥ కుదురుజేసినమనసుకూడుండమంటెనురాఘవేంద్రా । పా
దలుచుదుర్గుణభావమూలదిరుగురాఘవేంద్రా ॥౩॥ నీరజనేత్రుడ నీరూ
పుగనుజెట్లురాఘవేంద్రా । కరుణదయానిధేకాచిరక్షించవె రాఘవేం
ద్రా ॥౪॥ సారములేనిసంసారమీదలేనురాఘవేంద్రా । హంసరూప న
న్నుఆదరించవయ్యరాఘవేంద్రా ॥౫॥ అల్పభావములుఆరువర్గమ్ములురా

ఘువేంద్రా । తగుయుక్తనివ్వవుతలచిరక్షించర రాఘువేంద్రా ॥౬॥ నిగమవేద్యడనినీరూపుగను టెట్లురాఘువేంద్రా । యఘములుబాపినీయుదటవుంట పయ్యారాఘువేంద్రా ॥౭॥ మాయలోనజిక్కిమసలుచునున్నానురాఘువేంద్రా । మాయతొలగజేసిహాయిజూపవయ్యా రాఘువేంద్రా ॥౮॥ కోనలోనీవుండుకోలువుకూటమునాకురాఘువేంద్రా । కానరాక్యముగాకుండచెబిల్వరరాఘువేంద్రా ॥౯॥ పశ్చమవీధినపగుగిలు బెట్టిగిరాఘువేంద్రా । ముచ్చటతొబిలచి మురిపెముజూపరి రాఘువేంద్రా ॥౧౦॥ ఫాలరాగిమునలీల చెల్వరితండ్రిరాఘువేంద్రా । లీలలోమూలము మేలుతెలసికొందురాఘువేంద్రా ॥౧౧॥ శ్రీనిన్ను సృష్టిలోయుంచేవు రాఘువేంద్రా । మానమెరుగితేనమురాగలోభులు రాఘువేంద్రా ॥౧౨॥ మోహపాశములుమోసముదలచేసు రాఘువేంద్రా । నీసాహసమూనవారిచేక్కజేయవయ్యారాఘువేంద్రా ॥౧౩॥ ప్రతిముఖ ంగిపరచునారాలబట్టుక రాఘువేంద్రా । మతినిద్భంచినీదు మయముజూపవయ్యా రాఘువేంద్రా ॥౧౪॥ తల్లితండ్రులన్నదమ్ములెందరున్నరాఘువేంద్రా । కల్లఅల్లికలేగాచిరక్షించురాఘువేంద్రా ॥౧౫॥ చిక్కుపరచియెంతోచీకాకుజేసేవు రాఘువేంద్రా । మక్కువతోనన్నుమర్యాదజూడవెరాఘువేంద్రా ॥౧౬॥ నమ్మినభక్తులనలచటబెట్టకు రాఘువేంద్రా । ఇమ్మహిలోపల యిదికీర్తిగాదయ్యారాఘువేంద్రా ॥౧౭॥ దిక్కులేనిదానతోదెవ్వరున్నారురాఘువేంద్రా । పక్కబాయకనుపట్టినిబ్రోవవెరాఘువేంద్రా ॥౧౮॥ తనువుధనముమనముప్రాణములాదిగ రాఘువేంద్రా । యనయానీకిచ్చినయెటుకజూడవయ్యారాఘువేంద్రా ॥౧౯॥ విషయసుఖము లెంచ వేడుకి లేదయ్యారాఘువేంద్రా । కనుకుకల్మషనరకకూపములేశాని రాఘువేంద్రా ॥౨౦॥ దుష్టులద్భంచినాకష్టములబాపురాఘువేంద్రా । యిష్టముతోనిన్నువేడెదనాస్వామిరాఘువేంద్రా ॥ ౨౧॥ రాజయోగమందు రంజిల్లియున్నావు రాఘువేంద్రా । రాజయోగ సుఖరాజమివ్వర తండ్రి రాఘువేంద్రా ॥ ౨౨॥ తప్పులెన్నియున దలచకుమా తండ్రిరాఘువేంద్రా । ఒప్పులనుప్పునాతిప్పలుదీర్చవెరాఘువేంద్రా ॥ ౨౩॥ ఎన్నివేడిననుయేదిగిరనీదయ రాఘువేంద్రా । పన్నతనొందిన భక్తులరక్షించుర్రాఘువేంద్రా ।

౨౮॥ రాఘవేంద్రగురురావయ్యామొరవినిరాఘవేంద్రా।రంగను చేపట్టి రక్షించుటెకీర్తిరాఘవేంద్రా ॥౨౫॥

౧౩౧—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఇంతదయగలగురుని యెడబాసియిలలోన-
ఎంతమాత్రంబైన యేనోర్వజాలా ॥

చరణములు.

ఫాలమందున గురుడు భసితరేఖయుదీర్చి - మేల్తైనమంత్రంబుమెలగునది బలికెగా - కాలత్రయంబులకుకడభాగమందున్న - చాలశివనేత్రమున చెలగుమనిబలికెగా ॥ఇంత॥ గురుడు తీర్థప్రసాదములిరువుపరచినను - మరుకేళిసహస్రారమర్మమెరిగించెగా - అరుదునాపొజ్యోతియుంతరంగమునందు అరలేనిమోక్షపదమదిదెలిపినాడు ॥ఇంత॥ నడినాళముననుండు నాదరూపముపైని - యెడలేనిసుఖవార్ధియెపుడునందుంచెగా - కడురమ్యమైనట్టికైవల్యపదమునను - కడురాఘవేంద్రగురుకరుణరక్షించెగా ॥ఇంతదయగలగురునియెడబాసి ॥

౧౩౨—రాగం ఆనందభైరవి అటతాళం.

పల్లవి.

చిక్కునాడుపాపములకూ-ధారదక్కునా జ్ఞానశూన్యులకు॥

అనుపల్లవి.

చిక్కున అమృతముసిరియున్నవెళవెరిగి -
మక్కువనుగురుపదము మహిమదెలియగ్రోల॥ చిక్కు॥

చరణములు.

ఆరువర్గములపోవిడచి- నిర్మలానందబయిలుతొతఅచి। మేరుశిఖరమునందుమెరసిమెలగుచునుండె - సారమైనసుధధారగ్రోలినసుఖము ॥చిక్కు॥ కాననమ్మునరికవలెనూ - మనసుకోనయెంచుననిలుపవలెనూ । తానుతానైయున్నండితనుగుణమ్ములుపడలి- పూనికతొపుణ్యసోనతీర్థముగ్రోల ॥చిక్కు॥ బిందుపీఠమునందునిలచి- పరమసుందరాంగినిపొందుగలసి । పదియింద్రియమ్ములదిపటుతరంబునువిడచి - పదవి

జేసి। మంగళహారతులుభుజంగభూషణునికిని అంగాంగములకునిచ్చి-ఇంగితంబలరుపరిశుద్ధభోగాన్నములవిని యోగమిచ్చువ్యాళామీరు॥ఇంద్రి॥ సకలోపచారములుసాంబశివమూర్తికిని సర్వసంతోషమమరి-అకలంకమైనగురు తీర్థప్రసాదములు నెలమినాత్మనుగ్రహించి- సకలాత్ముడగురాఘవేంద్రపదపద్మములసాష్టాంగమమరజేసి - ప్రకటితముగనురంగపదమసుఖమునుపొందిపావనంబలరువ్యాళామీరు॥ఇంద్రియము॥

౧౩౮—రాగం ఆనందభైరవి ఆటతాళం.

పల్లవి.

ఎంతోచిత్రముజేసెనే-నాగురుస్వామి-ఎంతోచోద్యముజేసెనె॥

అనుపల్లవి.

ఎంతోచిత్రముజేసెయింతింతయనరాని-
అంతరంగమునందు ఆత్మశేషము దెలిపి ॥ఎంతో॥

చరణములు.

మర్మదేశముదీసెనె-సద్గురుస్వామి-కర్మలిఖితముబాపెనె। రమ్యఘాలమునసుమ్ముభూతిరేఖ-లిమ్ముమంత్రముచెవులోనమ్మియుండుమని॥ఎం॥ ఏకాంగినై రమ్మనె-శ్రీగురుస్వామి-జోకతోనియమించెనె । అంకించిరెంటిమధ్యనుశంకలునుదీర్చి-బొంకించిబిందుపీఠమురంకెవేయించి॥ఎంతో॥ ఆధారమనిఽల్కె-నే-సద్గురుస్వామి-భేదములిడిపించెనె- వేదివేదమూలకాదిపాదుజేసి - నాదిఆపోజ్యోతినొదిచిత్క-శదెలిపి॥ఎంతో॥ మాయజేసిరమ్మనె-శ్రీగురునాథు-స్థాయిజేసిలెమ్మనె। మాయలోనిమాయమయిముజేసినాడు - మాయదీసిగురునాయజేసినాడు ॥ఎంతో॥ శిరమునస్తమునుంచెనె-సద్గురుమూర్తి-కరుణచేరక్షించెనె । ఆరుదళములపై మేరుకొలనులోన - చేరదీసిగురుసారమిచ్చినాడు॥ఎంతో॥ హంసనటనదెలిపెనె-సద్గురుస్వామి-హంసోహమునుజేసెనే । హంసలోనిగుట్టుహింసలేనిపరమ - హంసబయలుజేసి - సంశముడిపినాడు॥ఎంతో॥ స్థిరమునమ్ముమనెనె - సద్గురుస్వామి-గురుసూత్రమిదియనెనె - హరుడురాఘవేంద్రగురుడురంగమ్మకు-పరుడుపరమసుఖవరములొసగినాడు॥ఎంతో॥

౧౩౪—యాలలు.

తలపతల్లితండ్రిడినీవెధాతగైవమైననీవె - నిలకడతోనమ్మినానూరా ॥ ఓ రాఘువేంద్రా॥ ఉల్లమలరనన్ను బ్రోవరా ॥౧॥ పాశబంధములుగోశి-ఆశపాశలానుదీసి-నీదాసకోటిలోనునిల్పరా ॥ఓరాఘువేంద్రా ॥ వాశిగల్ల పేరుగల్గురా ॥౨॥ మూటిపైనవెలిగేగురుని-మాటలోనదెలుపవయ్యా, సాటిపోటిలాకుగాదురా ॥ ఓరాఘువేంద్రా ॥ పట్టుగానీపదమునమ్మితీ॥౩॥ మోహాంధకారముఃమ్మి - సాహసమునజేరదీశి । సోహంరాజుకొలువునుంచరా॥ఓరాఘువేంద్రా ॥ ఓహోనెపుడుదలచుకొందురా ॥౪॥ అంటరాని యెరుకపదవి-రెంటిమధ్యవెలుగుచుండె । జంటబాయకనునిల్పరా ॥ ఓరాఘువేంద్రా॥ రెంటిమధ్యమేలుకొందురా ॥౫॥ ఎందుజూచినాంగోహాను-లందరును మోక్షపదము । జెందియుండెలావుజూపరా॥ ఓరాఘువేంద్రా॥ అందముగఅందేయుందురా ॥౬॥ రేపుమాపులేకవెలిగె-ఆపోజ్యోతిప్రాపుకోరి। నీదాపుజేరివేడుకొంగిరా॥ఓరాఘువేంద్రా॥ ఓపికతోనన్ను బ్రోవరా॥౭॥ దామాలురెంటికిమూల-దారియున్నబిలముగోన । వేరులేకవెలిగేమూలామూ ॥ ఓరాఘువేంద్రా ॥ పారజూచినన్నువుంచవే ॥౮॥ భ్యానిపోగుయోగీశ్వరి - నీతిబాలుబట్టుగార్యా। జ్యోతిమయమైవెలుగుచుండగా ॥ ఓరాఘువేంద్రా ॥ రీతినాకుదెలుపగదవయ్యా ॥౯॥ సార్వమునగ్రహాములోన-ధీరులెవరువరములిచ్చె । రారరాఘువేంద్రగురుడవై॥ఓరాఘువేంద్రా॥కరుణనుసగిరిక్షింపవైరాయి॥౧౦॥

౧౩౫—యాలలు.

శాటమంచిపసుగానుండి - మేటిత్రికూటమునందు । కోటిసూర్యకాంతియున్నాది ॥ ఓరాఘువేంద్రా ॥ అంటిఆనందముకంటని ॥ ౧ ॥ అన్నచిన్నకోనలోన-వన్నెకెక్కె-రెంటిమధ్య।పున్నమవెన్నెలగాయురా॥ ఓరాఘువేంద్రా ॥ చిన్నబాలుడుదయమాయరా ॥ ౨ ॥ మధ్యదృష్టిమహిమగలిగి-వర్గికతో నేపోగాను। ముద్దుగుమ్మకొలువైయున్నదీ ॥ ఓరాఘువేంద్రా ॥ సుద్దులన్నిబలుకుచున్నదీ॥౩॥ పశ్చమవీధినబోయి-హెచ్చిసహస్రారమున । అచ్చపుదృష్టినినిలువగా॥ఓరాఘువేంద్రా ॥ మెచ్చుప్రణవరవమువ్రోగురా॥౪॥కుండలిపైకె త్రినేత్ర-దండిఁ తేజమందు కలిపి

యుండుసోహంరాజుగంటిరా॥ఓరాఘవేంద్రా ॥ అందువేమకతోనుంటి
రా ॥౫॥ అండపిండబ్రహ్మాండముల-నిండనిండివెలుగుచుండె। యుండు
ఆపోజ్యోతిగంటిరా॥ఓరాఘవేంద్రా॥ అండజేరిఅచటనుంటిరా ॥ ౬ ॥
పంచభూతములనుబట్టి కొంచపుగృహాలోనదీసిసంచితముపీడగొట్టెరా॥
ఓరాఘవేంద్రా॥పంచామృతమారగించరా॥౭॥ మూర్ఖాలకొలనులోన-
యిమ్మునొకకమలమధ్య। తుమ్మెదరొదలుజేసెరా॥ఓరాఘవేంద్రా॥తన్మి
తేనెచొక్కులాయరా॥౮॥వేదాంతసారరూపమై- వెలుగురాఘవేంద్ర
గురుడు-బొందితోకైవల్యమొసగెరా॥

—*(తరికొండ వెంగమ్మగారుజెప్పిన కృతులు.)*—

౧౩౭—ద్విపదార్థములు.

శ్రీకరంబైనట్టి శ్రీగురుకరుణచేకొని కర్మసంచితమనుభవించి।
సాకారగుణముల సన్నుతిజేసి ॥ ఆకాశాతీతుడందురే- ఆనందమవ్వ॥
లోకానజేయుచుందురే - జోకతోచూపుమనసు యేకముజేసిలోని -
వాకిలిదీసి సత్యలోకానుజూచిచిత్త-శాకాశాతీతుడందురే ఆనందమ
వ్వ-లోకాన జేయుచుందురే॥... ... ... ౧-

అంజలులై రియీయజ్ఞానమనెడి - పెంజీకటినిజక్కి-పెనుగుచు
తుదను - కంజాతునిగుగురుని - కరుణోదయమున ॥ కంజదళాక్షుడం
దురే - ఆరెంటిలోన - కంజములానుజూచిరే - రంజిల్లుచునుపాపపుం
జములోను వెడలిచి - రంజీవులవలెనేని-రంజనులైనముద్దు ॥ కంజద
ళాక్షుడందురే - ఆరెంటిలోను - కంజములానుజూచిరే ॥ ౨॥

ఆదినిత్రివిధప్రసాదమొనరించి। భేదవాదంబులభేదించి తత్వ।
వేదాంతనిష్ఠచె వెలసిన బ్రహ్మ ॥ నాదవినోదమందిరే - సంతతముల
నాదిబోధనుజెందిరే - మోదమలరహంసపాదుతెలసికొండ - మీది
త్రోవలో అంతర్ - వేదిసోపలవేణు - నాదవినోదమందిరే- సంతత
ముల - నాదిబోధనుజెందిరే॥ ... ... ... ౩॥

కర్మమార్గంబునకడగానలేక।కర్మపరిత్యాగకారణయోగ।మర్మ
జ్ఞులై చిత్సమాధిచేపూర్వ ॥ కర్మమూలముగందురే - విజ్ఞానమార్గని-
ష్కర్మభావమునజెందిరే - కర్మాకర్మములరెంటిమర్మమెరిగిజీవ- కర్మ

మింతాయనని - నిర్మలమైన దేహి ॥ కర్మమూలమునగంపరే- విజ్ఞాన మార్గాని - మర్త్యభావమునజెందిరే॥ ... ... ౪॥

కామాదిగుణములకలిగి సంసారపామరంబులచిక్కి- పడనీయక చి । మేమియుకోరక మేమైనకోన ॥ సీమలోజూచుచుందురే-సత్య నిత్య - రామునిసేవజేతురే-సీమములో చండమామ దేశము యేలు- ధాముమను మమోక్ష - కాములుండేటికోన ॥ సీమలోజూచుచుందురే- సత్యనిత్య - రామునిసేవజేతురే ॥ ... ... ౫॥

ఎన్నిజన్మంబులఎంచిచూచినాను । తన్ను తానెలియని తాత్పర్యముగను । విన్నగనాసాగ్రదృష్టిచెపండు ॥ వెన్నెలజూచుచుందురే - చిన్నారిముద్దు-కన్నెల కాపాడుచుందురే- ఉన్నతమైన పంచపన్నెచిలుకలగాడ-దన్నిపోయ్యేటిజాడలన్ని-శోధించిపండు - వెన్నెలజూచుచుందురే - చిన్నారిముద్దు - కన్నెలకాపాడుచుందురే ॥ ... ౬॥

సావధానముగనుసదసద్వివేక।సేవవిచారంబుచేయుచుతురీయ। కేవల కుంభకక్రీడసలుపుచును ॥ జీవునితావుజేరిరే - విశ్వాత్మనాది - దేవునిమాయతెలసిరే - భావాభావముల రెంటిభావమెరిగినీన- భావమింతాయనని - పావనమైనపరమ ॥ జీవునితావుజేరిరే - విశ్వాత్మనాది - దేవునిమాయతెలసిరే॥ ... ... ... ౭॥

కపటమార్గంబున కడగానలేక।అపరోక్ష స్వార్థఅనుభవమునకు । మపమునుతోతరికొండ నేప్పునజేరి ॥ తపముసాధించబోయ్యేరే - ఓంకారగురుని - కృపగల్గి నిపుణులయ్యేరే - విపరీతమైనవిషయచపలములణచిమంచి - ఉపమాతెలసిజన్మ - సఫలమయ్యేటిశాంత॥ తపముసాధించపొయ్యేరే - ఓంకారగురుని - కృపగల్గి నిపుణులయ్యేరే॥౮

### ౧౩౮—కందార్ధపదువులు.

సిరిమించునట్టి గురుపద । సరసిజముగభక్తినిలిపిసాధనను ననిబ్బరుడై । సజ్జనసంగతిగని । పరమనిసద్భక్తినున్న * వారే బ్రాహ్మణులూ ఎవరైనగాని వారే బ్రాహ్మణులూ * అరయప్రకృతివికృతులనుబాసి పేర్మి । పరమార్గమని యాశపడకనిలచినట్టి వారే బ్రాహ్మణులు * ఆత్మనుగన్న వారే బ్రాహ్మణులు ॥ ... ... ౧॥

గళారతులివ్వగ - గంగసహోదరుడై యేలునట్టిశ్రీ - రంగధాముని గం
టినిసద్గురుదేవ ॥కలగంటికలగంటిని॥

౧౪౧—గురుశిష్యసంవాదంబగుయాలలు.

శ్రీమానినీమణినిన్నెంతో-ప్రేమమీరగనుగాడే - నీమముమా
గురుడుదెలిపెనే ॥ఓముక్తికాంత॥ నేనునిన్నుకూడియుండెనే ॥౧॥ శ్రీమ
హితమైనపరమశివయోగాభ్యాసముననీవే - నీమమున జేసినావా యీ॥
ఓయోగిచంద్ర॥ నీనిజమెల్లదెల్పవోయిం ॥౨॥ ఆరుగురిపొందువిడిచీ ఆ
నుశాసనములే గడచీ - ఆరుగురిలోనే నేగలశితి ॥ఓముక్తికాంత॥ ఆరుగు
రికిపరముదెలిపితీ ॥౩॥ తెలిసినవాడవై తనీదేహము యుండెమహిమ-
సలలితముగానాకుజెప్పరా॥ఓయోగిచంద్ర॥సమ్మతముగనిన్నుపొందేనా॥
౪॥అంచలంచలాపద్మము లారున్నా వివాటికవలా - మంచిలేనెకొలను
యున్నాదె ॥ ఓముక్తికాంత ॥ పొంచిపవనుకొలనుగన్నదే॥౫॥ మిన్ను
లైదుదాటిపంపు - వెన్నెలజూడగనందు - కిన్నెరరవమదేమిరా॥ ఓ
యోగిచంద్ర ॥ కినసిదాసిలోనే ముండురా॥౬॥ ఓహోహోయినుమాకిన్నె
రాలోఓంకారస్వరూపమైన - సోహామనభావమున్నదే॥ఓముక్తికాంత
సొలసిపవనుడందెయున్నాడూ ॥౭॥ ఈవిధానవుండే పవనుయిరుగడలన
డచికలసె - తావులిధానించిజెప్పరా ॥ఓయోగిచంద్ర॥ తప్పకండకనే
నెప్పరా ॥౮॥ పుండరీకపమున కెగువ - కొండదారినుండెనీలో- మం
డలమధ్యమునగలసునే ॥ ఓముక్తికాంత॥మానసముచ్చటబొలసునే॥౯॥
ముదముమీరగను పెద్ద - నదులు రెండుకలసివచ్చి - కుదురుగకూడె
చోటదీరా ॥ ఓయోగిచంద్ర ॥ గురుతునిధానించిజెప్పరా ॥౧౦॥ తన్మ
యమునగంగ యమున - తారకమండలముదాటి - చిన్మయపాత్రలో
నిండునే ॥ ఓముక్తికాంత ॥ శిశువుదానినమనుండునే॥౧౧॥ బ్రహ్మా
నందబిందునందే పద్మములోనిండియుండె - బ్రహ్మమెకారణమై వెలు
గురా ॥ ఓయోగిచంద్ర ॥ బ్రహ్మజ్ఞానివైతె దెల్పరా ॥౧౨॥ బ్రహ్మానం
దబిందుసర్వ - ప్రపంచకారణమగుచు - బ్రహ్మరంధ్రమున వెలుగునే॥
ఓముక్తికాంత ॥ బ్రహ్మమెసాక్షిగ వెలుగునే ॥౧౩॥ మంచిదైతెయింక
నొక్కమర్మమునేనడిగే గాని - పంచభూరననగయేమిరా ॥ ఓయోగి

చంద్ర ॥ పట్టుగాని వాదిదెల్పరా ॥ ౧౪ ॥ పంచభూతములనుతనలో- గాంచి అయిదునొకటిజేసి - మంచిజీవుడవుతరించితే ॥ ఓముక్తికాంత పంచధారననగప్రఖ్యాతే ॥౧౫॥ సంసారశక్తినివిడచీ సకలశత్రువులగడచి - హంసరూపుమెందుజేరురా ॥ ఓయోగిచంద్ర ॥ ఆరహస్యమివుడెదెల్పరా ॥౧౬॥ మూడుమూడుమూడుదాటి - మూడోమేడజేరిఆత్మ - కూడిఆనందింపుచుండునే ॥ ఓముక్తికాంత ॥ కుదిరినరహస్యమింతెనే ॥౧౭॥ భావసహితముగనన్ని - భావములోదెలసినావు- భావరహితమేదోదెల్పరా ॥ఓయోగిచంద్ర॥ భావభావములోగల్పరా॥౧౮॥ పొంగుగాను మేరుశిఖరమంది ఆవాలగలయజూచి - అందుభావ తీతమైననే ॥ ఓముక్తికాంత ॥ అంతటనేనిండియున్నానే ॥౧౯॥ ధీరనీవుతరికొండనారాయణగురుడవైతె - రారనేనునీకుమ్రొక్కేనూ ॥ఓయోగిచంద్ర ॥ రమణమీరనీకుదక్కేనూ ॥౨౦॥

వెంగమ్మగారు దిగుడుభావి త్రోవ్వించు సమయంబున
జలముపడకుండెగంగను మొరజేసినకృతి.

౧౪౬—రాగం మోహన త్రిపుటచావుతాళం.

పల్లవి.

ఓతల్లిగంగభవానీ-రావె -

అనుపల్లవి.

ఖ్యాతిగయిచటికికపటముమాని॥ఓతల్లి॥

చరణములు.

హరిపాదమునబుట్టినావు - పురహరునిజటాజూటముననిలచినావు । పరమపవిత్రవైనావూ- మాపాలీటవెలసిపూజలుగైకొన్నావు॥ ఓతల్లి ॥ హరికర్పితముగ శ్రీతులశి - వనమదలనార్చతోనిన్నుగావింపవెలసి । తరుణిదిపెంచినమెరసి - వున్ననరలేకరావెశేషాద్రితోవెలసీ॥ఓతల్లి ॥ వాశిగనినుచాలనమ్మి- చిన్నవాండ్లకాదరువుగవున్నసొమ్మమ్మి । చేశితినినుపనినమ్మి-చేయనిరవుగయిచటికిబిరబిరరమ్మి॥ఓతల్లి॥ తరికొండనరసింహుడైనా - చాలగిరివాసనేవేళకీర్తింపుజ్ఞాన।కరుణనాపైనుంచుశాన- మమ్ముకడతేర్చెభారముకల్గినదాన॥ఓతల్లి॥

—*(దత్తాత్రేయులవారు జెప్పినకృతులు)*—

౧౪౩—రాగం కేదారగౌళ.

ప ల్ల వి.

ఇంతదయగలగురునిఎడబాసియిలలోన-యంతైనతాళగలనాలలనా ।

అ ను ప ల్ల వి.

చిత్రాసనమునుంచి నొసటిత్రాతయుదుడచి భసితము
గభసితరేఖయుదీర్చనెచెలియా ॥

చ ర ణ ము లు.

ముదమునను శిరసుపై కదసిహస్తమునునచి - ఇదిగొసాయు
జ్యమనెనెచెలియా । గురుడనుచుతావచ్చిసరిమోహమునచెవులొ- గు
నగునమని దెలిపెనెచెలియా ॥ఇంత॥ తరుచైనవిషయేంద్రియములన్ని
కడకణచి - తారకముగురిజూపెనెచెలియా । అంతరంగమునందుఆ
నందభరితుడై - ఆత్మశేషము దెలిపెనేచెలియా ॥ఇంత॥ అనుదినము
మనమునను నెరిగికొని పెనుగొని - అతివరమ్మనిపిలచెనేచెలియా । కన
రానినుజ్యోతికమలమునకళదెలిపి - కనిపెనగియుండుమనెనెచెలియా
ఇంత ॥ ప్రాయంబురూపంబుపైనిండ అలుదుకొని - పాపములుతెగ
టార్చనెచెలియా । మాయమీదికి దండుమహిమతోతావచ్చి - మం
త్రానవిడిపించెనేచెలియా॥ఇంత॥ పట్టరానటువంటిపంజరంబునుదెచ్చి-
పట్టిముడివిడిపించెనేచెలియా। గుట్టుతొఅతిరహస్యగోప్యమంతయుదె
లిపి-గుణముగలిగుండుమనెనెచెలియా ॥ఇంత॥ రెండుకొండలనడుమనిం
డుప్రణవరవము-మెండుకొనిమ్రోగించెనేచెలియా। తండిబిలములొజొ
చ్చిగుండ్లేరుపైనెక్కి - ఉండమని ఊర్ధ్వవీధిన నిలిపెనెచెలియా॥ఇంత॥
సంతతముశివగణాధీశ్వరులతోపొందు - సాకేతపురమందుచెలియా।పం
తమునదత్తగురువంశబ్రహ్మేంద్రునకుపట్టిదాసీనైతినేచెలియా ॥ఇంత॥

—*(శివగంగువారికీర్తనలు)*—

౧౪౪—రాగం నాదనామక్రియ అటతాళం.

ప ల్ల వి.

వినజెప్పరయ్యా - తత్వార్థము - వినజెప్పరయ్యా ॥

అ ను ప ల్ల వి.

వినజెప్పరయ్యమీరనుకూలముగసర్వ -
మునుబ్రహ్మమనెటిసజ్జనభావమెల్లమా ॥కిన॥

చ ర ణ ము లు.

అరివర్గములను పోదరిమినిజానంద - పరిపూర్ణులై మోక్షపద విశెందినరీతు ॥లిన॥ పుట్టుమొదలుజాడబట్టిలోపలిమాయ - బట్టబయిలుజేసినట్టి ఖేచరిమాగ౯ ॥ మిన॥ మండలములదాటెఖండసమాధిన-పండువెన్నెలలోననిండియుండినభావ ॥ మిన ॥ నిదురలోపలిదృష్టిచెడరకజీవుని తుదమొదలెరిగి - తత్పదమైనవిధమెల్ల ॥విన॥ రంగుమీరినశివగంగలోపలను చెలంగుచుండెటిగురులింగనిమహిమమా ॥కినజప్ప॥

౧౪౫—రాగం కాంబోది ఆదితాళం.

ప ల్ల వి.

బ్రహ్మొపదేశమైతినమ్మ - నిర్గుణపర-బ్రహ్మొపదేశమైతినమ్మా॥

అ ను ప ల్ల వి.

బ్రహ్మానందముతో బ్రహ్మార్పణంబుజీవ -
బ్రహ్మైక్యమునసోహంబ్రహ్మమనెటిపర ॥బ్రహ్మ॥

చ ర ణ ము లు.

మూడుకాలలగూడునమ్మ - జోడుగమూడు - ఆరుచక్రాలమేడలమ్మ - మూడునదులపాలిచేడేలతోనుగూడి-ఆడుచున్నపిన్ననాడు ఆత్మానుపర॥బ్రహ్మ॥ అన్నిటవెలుగుచుండునమ్మ-అక్షరాతీతమన్నివిధములాయనమ్మ - భిన్నాభిన్నముగప్రసన్నమయ్యేటిజ్యోతికన్నులుదెరచిపండువెన్నెలలోనపర ॥ బ్రహ్మ ॥ భేదాభేదములేదోయమ్మ - సోధించిచూడ - నాదాతీతమున్నదమ్మ - మోదముతోడ తత్వాదులకెల్ల మాయ - పాదుజేసీనప్రకృతి ఆదిఅనాదిపర॥బ్రహ్మ॥రంగైనమునుల సంగమమ్మ - పొంగుచుశివ - గంగలోవానిసంగమమ్మ-శృంగారముగ ప్రాణలింగఓంకారగురుని చెంగటజేరి అంతరంగమందునపర ॥బ్రహ్మొప॥

## వసంతులవారి కీర్తనలు.

౧౮౬—రాగం కల్యాణి త్రిపుటతాళం.

పల్లవి.

మానపుష్పరసామృతము .

అనుపల్లవి.

జ్ఞానులకు నెల్లజీవనము భగవద్దాసులకు - వరోల్లాసము॥

చరణములు.

వస్తుసాక్షాత్కారణము - దివ్యవస్తువన విశేషణము - వస్తులో పాలివస్తునికరము - ప్రశస్తమైపరవస్తువైనాది మాన ॥ కారణాతీత మైయున్నదీ - విశ్వధారణముగు మూలమైయున్నది - మీరినిగమా చారులకునధ - కారులకు మనోహరమైనది॥మాన॥ పుండరీకాక్షునికరువైనదీ - అతనిఅండనెడబాయకున్నదీ-అండపిండబ్రహ్మాండకోటుల నిండనిండియఖండమైనది ॥మాన॥ అన్నిరూపములైయున్నదీ- బుధులెన్న అన్నిటబరగినదీ - కన్నవిన్నట్టిసునులకు పదహారువన్నెలై బరగి యున్నదీ ॥ మాన ॥ అంతరాత్మమైయున్నదీ - లక్ష్మణాచార్యగురుడానందించినది - అంతరంగమునందు కాద్రిః - సంతగురుడుప్రసదించినది ॥ మానపుష్ప ॥

౧౮౭—మేలుకొలుపు.

తేనెగొనరేయమ్మలారా - తేనెగొనరేయక్కలారా - మానిల పలకూడిపెట్టినమధురమగు తేనే ॥ అమ్మ తేనెగొనరే ॥ జుంటితేనెయ జురుకుతేనెయు ఎంగిలెరుగనిసనకాదులకప్పుడు - జుంటియోగులుఅంటి పెట్టినజాజులగు తేనే - సాటియెసిమిదికోటియోగులుకూటములలోకూ పెట్టిన - పూటపూటకుపొంగుచుండేటిపుడకయా తేనే ॥అమ్మ తేనె నరే॥ కొండకొండలనట్టనడుమనుగంపిశలలోపండు తేనెయు- నిండుగ మునసిచ్చనెక్కి సిక్కసిసినదీ - దండితత్వములెలుపునిలిపియుధరణి యీ తేనెగ్రోలిన-సంకీర్తి లభగవంతుమెచ్చునుభాగ్యమగు తేనే ॥అమ్మ తేనగొనరే ॥ పెరియపెరియహృదయవనులను- పెరియకొండల నట్ట నడుమను - గరిమయోగులుకలసిపెట్టిన ఘనములగు తేనే - అరసిం

చ ర ణ ము లు.

నిటలమధ్యమునదుర్గతమైనమాయమి - కృటమైతోచినదే ముపటబీజమాత్రమై ॥తగ॥ గిరిమీదనొకచింతకుపుకొమ్మనుజూచివి రులుబూచినదేమొవింతలాయుమాకు ॥తగదెల్ప॥ కాడియడములమించు నడిమినూదినదేవ గురియున్నచోటు శ్రీగురుత్తైనవారు॥తగ ॥ పురము లకెల్లగోపురమైనవైకుంఠ - పురమేదో శ్రీలక్ష్మీపురుండేడో మాకు॥తగ॥న దులుగూడినచోటుకుదురైనవరదివ్య సదనమధ్యమునందు మిథునతా రకమేదో ॥తగ॥ కన్నుగవెలిలోనపరిపూర్ణమైనట్టి - చిన్నకొమ్మర్ల శ్రీ చెన్నుడున్నట్టు ॥తగ ॥

౧౫౦—రాగము ముఖారి ఏకతాళము.

ప ల్ల వి.

అనుభవమునజూడుడి - బ్రహ్మవస్తు - ఘనముతెలియరానిది ।

అ ను ప ల్ల వి.

అనుశయముగురుపాదవనజాతములెనమ్మి -

తనుతానుగనుగొనితన్మయయుక్తిన ॥అనుభవ॥

చ ర ణ ము లు.

అనెనంటెఅనరానిది-చెవులకునిండ-వినెనంటెవినరానిదీ । కనె నంటెకనరాదుమనసుకెంకితెరు - దినమణిమధ్యసందీప్యమైయ్యున్నా ది ॥అను॥ చెప్పిచూపరానిదీ-బోధించినా-గొప్పకురుచగానిదీ । ఇప్పుడ ప్పుడనకయేర్పాటులేకుండ- నొప్పగురాకుండసూక్ష్మమైయున్నాది॥అ ను॥క్రియలకుచిక్కానిది- కించిత్తయినఇలన్యాయముగానిది।భయభక్తి తాత్పరియభావములకువేరై - బయలులోనెబయలుబ్రహ్మమైయున్నా ది ॥అను॥ అతిసూక్ష్మమైయ్యున్నదీ-సృష్టిసర్వగతపూర్ణమైయ్యున్నదీ। మలమూలజెందకవ్రతమూలకుంగక-సతతముశ్రీరంగపతితానైయ్యు న్నాది ॥అనుభవమున॥

—*(కుళ్లూరువారికీర్తనలు)*—

౧౫౧—రాగం ఆనందభైరవి ఆటతాళం.

ప ల్ల వి.

ఎక్కడున్న శివరాత్రి-ఏకాంతపరులకు-ఏడనున్న శివరాత్రి ।

అనుపల్లవి.

ఎక్కడున్న శివరాత్రి వేదఘోషంబైన ప్రణవం -
ఆదిలోతనలోవిన్న అంతరంగపరులకు ॥ఎక్క॥

చరణములు.

కంటిమింటికంటినడుమనంటగలసి మెలసితనలో । జంటబాయ నికర్మములుయికనంటకుండజేయువారికి ॥ఎక్క॥ అంబరమధ్యమునందు సంభ్రమములుజూచిని । రంబమునవిజసన్మార్గముకనుగొన్నవారికి ॥ఎక్క॥ చూడమ్మశివరాత్రిసొంపుతోతనలోతరచి । పోడిమిగకుళ్లారిశివబ్రహ్మ ముకనుగొన్నవారికి ॥ఎక్క॥

—*(కృష్ణావధూతశిష్యుడు గోసంగిచెప్పిన కీర్తన)*—

౧౫౩—రాగం సౌరాష్ట్రము — [illegible]తాళము

పల్లవి

తాలెల్లెలెల్లెలో - ఏలాలాలెల్లెలో

అనుపల్లవి.

తాలెల్లెయనిదశతాళగతులతో - కోరియనకొమ్ముఘోషించగ ।
మేలెల్లనాకత్తిమెరుపు మొనలమీదహాలెల్లెయని పొంగులాడితిరాలింగ ॥

చరణములు

ఆకాశవీధినిఆర్భటించుఘోష చేకొనిగురుకరుణచేజాతరా । ప్రకాబ్రహ్మమౌని వెలుగందుచూపుల - రాకపోక చెందినాడితిరాలింగ ॥తా॥ కామాదిదుర్గుణస్తోమములనియేటికామీరవేటలఁ జెగనరకి । తామసము నెమున్నతలద్రుంచిమిక్కిలి - వేడుకతోచిందులాడితిరాలింగ ॥తాలె॥ చూస్తిరతేజమువేస్తిరకేకాటుచిస్తుకొమ్ముకత్తిముస్తీబుతో । దస్తుతప్పుకుండదరువునసాట్యము - అస్థినపురములోఆడితిరాలింగ ॥తాలె॥ ఒడలుకొమ్ముచేసివనరనుషుమ్నాము - నడినాళముకొమ్మునాదమురా । మొడమకుడులవంకయగనూదుదిగనూదు - నడిపించుయీకొమ్ము నాదామురాలింగ ॥తాలె॥ ఈకొమ్ముఘోషముఇందరిప్రాణముఈకొమ్ముఘోషముయీశుడురా । ఈకొమ్ముఘోషము యించుకతెలిసితె - శ్రీకంఠు

డితడటసిద్ధము రాలింగ ॥తాలె॥ వంటనిఆరిటికుంకునమూటిని గెంటించి కుమ్మెరనాకొమ్ము। రెంటిలొరెంటిటిని అంటజూచినవాని - బంటుకుబంటుకు బంటానురాలింగ ॥తాలె॥ లోకాలుమునిగేమిలేకుండినప్పుడు - ఆకుపై కృష్ణావధూతాడుతా । ఏకమైకొమ్ముతొ లోకాలుగల్పించి ఆకొమ్ముతో చిందులాడవలెరలింగ ॥తాలెల్లె॥

—*(నాసరమహాత్ముడు శిష్యులు జెప్పిన కీర్తనలు.)*—

౧౫౩—రాగం కల్యాణి త్రిపుటతాళం

పల్లవి.

ఒకరిజోలికిబోనెల్లామ - మం ।

అనుపల్లవి.

మొకరన్నరనిచింతనెల్లామ॥

చరణములు.

మట్టుమీరితిరిగిమతదూషణము జేసి మాటలాడబోనెల్లామ - నెట్టానగురుపూజనీతి మార్గముదప్పినిం దెలుశాయబోనెల్లామ । కట్టిడితనమున క్రమముదప్పికూరకసువులు మెన్నబోనెల్లామ- ఇట్టిమాయతిపతియం బెరుమానారుపట్టి తిరువడిఘళ్ పఠన జేసినజాల్ ॥ఒకరి॥ దానధర్మములేక ధరణికర్తాదులదోషములార్జింపనెల్లామ - దీనత్వమున పొట్టకొరకు తిరిగిబొంకి । దినములుగడుపబోనెల్లామ - దీనరక్షకుహరిదినముదలుపనట్టి దినమొక్క దినమైననెల్లామ-మానకయం బెరుమానారుదిక్కని । మానకమతియెందుమరువకుండినజాల్ ॥ఒకరి॥ వేపచీరెలుమొలపీపూనగూప్పుకమెల్లునుగొల్వబోనొల్లామ - కపటవేషము నకలవెఱ్రిసువ్వాలకప్పగంతులువెయ్యనెల్లామ । ఒప్పైనగురుకులవలసినంతయుచాల - ఒండ్లపసుపుబుయ్యనెల్లామ । తప్పకమాతిరుమంత్రములోరుచిచప్పరించి చవిచూడగలిగినజాల్ ॥ఒకరి॥ అంగములో ప్రాణలింగాము దెలియక అంగాలుసేయబోనెల్లామ - శృంగారముగ మేనమెరుగులుబెట్టుక । సంగతితిరుగబోనొల్లామ -భంగముగఆలుబిడ్డలవిడనాడిబెంగారులై తిరుగనెల్లామ॥ రంగుగాను శ్రీరామానుజార్యులరంగరంగ శ్రీరంగడన్నజాల్ ॥ఒకరి॥ ఒడలభూతిబూసిపల్లజడలుదా

అరుంధతికులమునూయమ్మనుమీా । పారమార్థికసమ్రజ్వరిల్లుచుంట - వీ
రగురుషిచ్చిందియీాకొమ్మురాలింగ ॥తాలెల్లెలెల్లెలో॥

౧౫౫—రాగం నాదనామక్రియ త్రిపుటతాళం.

పల్లవి.

హరినామస్మరణజేయకుంటె అవలగతియేమీా

చరణములు.

అన్నదమ్ములెడబాయకమునుపే - ఆలునిష్టూరములాడకమును
పె । కన్నకొడుకుదండించకమునుపె - కాయంవ్యాధులచిక్కకమును
పె ॥హరి॥ వృద్ధాభ్యంప్రాప్తించకమునుపె - ఉత్సాహంబలిముడుగ
కమునుపె । నిర్ధనులై దిగులుపడకమునుపె - నేత్రాలుపొరగప్పకము
నుపే ॥హరి॥ దవడలులోనికి పోవకమునుపె- దంతపటుత్వముతగ్గకము
నుపె । చెవులకు మందముదగలకమునుపె - చల్లబోవనడవజాలకము
నుపె ॥హరి॥ కర్రబూనుకొని తిరుగకమునుపే - కంఠధ్వనితగ్గకమును
పే। అస్యమందరికివంగకమునుపే -అంగంతలవణికించకమునుపె ॥హరి॥
అప్పులవారుకదియకమునుపే- అన్నమొకరుతినుపించకమునుపె । దొ
ప్పలోనుచెయికడగికమునుపె - దోవతిబలునై తోచకమునుపేహరినా॥

ఈశ్వరమ్మగారిప్రథమశిష్యులు బంగారుసుబ్బయ్యగారి వచనములు.

౧౫౬—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఏమిస్నానము సంధ్యయేమిజపతపము -
సోమసూత్రమునందుస్వామినెరుగకనుం ॥

చరణములు.

పామరముచేడక్కిపటునిగానగలేక - తామసప్రవృత్తులనుతగిలి
తగిలీ । సోమయాజులమనుచుసొక్కరంభకుజిక్కి - కామాంధులైత
న్నుకానకనెపొయిరీ ॥ఏమి॥ వాసనత్రయములనుగాసిపడుటేగాక - దెశి
కులచేరకను యీాశుగనగలడా । పాశబంధములచేపట్టువదిలితెగాని -
బేసికన్నైన శివకాశిగనగలడా ॥ఏమి॥ ఇష్టలింగమునున్న హితవుదెలి
యగలేక - సృష్టిలోపలమేము శ్రేష్టమనుచుకా । నిష్టలునుబొరయచు

నునీళ్ల మునుగుటగాక - దృష్టినడుమనున్న దేవునిగనగలడా ॥ఏమి॥ లింగాంగములు రెండులియ్యమైతరచితా - గంగస్నానము జేయసంగ తెరుగకనూ । భంగమైపోయిపుడు బింగిరాళ్లకుమ్రొక్కి - బంగారుమేడలో ప్రభువుగనగలడా ॥ఏమి॥ ప్రణవసూత్రంబైన వీరగోవిందగురు-అణురేణుపరిపూర్ణమైయ్యుండగాను । కనరానిపరతత్వమైనయీశ్వరిపాద-కమలమే మరకిపుడుకనితిరుగరాదా ॥ఏమిస్నానము ॥

౧౫౭—రాగం కేదారగౌళ.

పల్లవి.

ఇదుగో గంగాయాత్ర ఇది తెలియరయ్యా ।
పదిలముగ సాధించి బ్రహ్మమనరయ్యా ॥

చరణములు.

కదిసిభ్రూమధ్యమునకన్ను దెరచినయపుడె - ఉదితమాహాజ్యోతియున్నతావునసూ । చెదరకను బింమకళచంద్రమండలమందు- వదలకను సేవించెవరయోగులకునూ ॥ఇదు॥ అనుకూలమైన బ్రహ్మానందజలధిలో - దినకరుండై వెలగుదేహమునను । అనుమానమైన మోహాంధకారము బాసి - దినదినమువర్తించె దివ్యయోగులకూ ॥ఇదు॥ చలముకోప ... మాని శాంతస్వరూపమై - కులమునీపుగ చేరి బిలములోపలనూ। కలకంఠితో గూడి కళలంటి పనుగుచును - జలకమార్చన జేయుజాణయోగులకూ ॥ఇదు॥ అంటిముట్టగరానిఆగంగనదిలోన- రెంటినడుమను తానెంటిగాను । నంటివెలుగుచునున్న నామహాప్రణవంబు- నంటిసేవించనష్టవంటి యోగు ‧ కూ ॥ఇదు॥ విలువిగపోతులుకువీరగోవిందగురు - కరుణనమ్మినశివశరణులకును। వరములునుయిచ్చేటివసుధలోయీశ్వరి - చరణమేమరకున్న సేవ్యులకునెల్ల ॥ఇదుగో॥

దూదేకుల సిద్దయ్యగారి శిష్యుడు

—*(మామిళ్లదొడ్డుపునారయణరెడ్డిగారికీర్తన.)*—

౧౫౮—రాగం నాదనామక్రియ ఆదితాళం

పల్లవి.

ఎందాయరా - గురుడ నెందాయరా ॥

అ ను ప ల్ల వి.

ఇళిడ్లనడుమగుండ్లుద్రిప్పి - గండ్లనడుమ రెండ్లలోనె ॥పెం॥
పరతత్వమనె పందిటిలోనే - హారమ్మైనఅరుగు వేశి। నెరసినస ద్గురువాక్యము సరసముతో శాసలుబెట్టి ॥పెం॥ ఓప్పుగఓంకారనాధంవ నరుగజోడుమేళముల - తప్పకసూత్రస్వరమూన మెప్పుగశోభనములు పాడి ॥పెం॥ నీతిమార్గమునెయిల్లుఖ్యాతిగ అలికిపూశి - ఖ్యాతిగమంచ ము వేశి । ప్రఖ్యాతిగగూర్చుండినపుడె ॥పెం॥ మేలుమేలుప్రణవరము - కీలు తెలసి లోనుచూచి । మూలమంత్రసారమూన మురయుచుతలం బ్రాలుపోసి ॥ పెం॥ మూలాధారమనెబువ్వ - నాళమనెపళ్లెరములో । చాలగగూర్చుండి రందరు - మేలుగబోంచేసినపుడె ॥పెం॥ దండిగఅ ఖండజ్యోతి ఉండచూచిపండినట్లు - కుండలిశోధించినపుడెదండిబాణ బుగుసులుమొగశి ॥ పెం॥ పద్దుగనిజధారమునకర్తని దానితో కలసి-సద్గు మానిసిద్దగుటనిసాక్షాత్తు సద్గురుడనితెలసి ॥ పెండ్లాయరా ॥

—*(పరశురాములవారికీర్తన.)*—

౧౫౯—రాగం భైరవి చాపుతాళం.

ప ల్ల వి.

విక్రయించెటిపండుగాదమ్మ - ఇదివిశ్వమందున తెలియలేరమ్మా॥

అ ను ప ల్ల వి.

విక్రముడై నట్టివిభుడుడప్పుగురు - ఆక్రయమునదెలి పె అమరితియ్యనిపండు ॥విక్ర ॥

చ ర ణ ము లు.

దృశ్యములలోపల దృశ్యమైనపండు- ముక్తితుదనుయుండెమూ ల మైనపండు । చిక్కించుకునెనంటువక్కడు ఆపండు - ఎక్కడ వెతకిన వక్కటయినపండు ॥విక్ర॥ ఆకుపువ్వుప్పిందెలేకయున్నపండు - ఆకాల మీకాలమేకాలమాపండు । ఆకాశతీతమై అంటిఅంటనిపండు ॥విక్ర॥ ఆలుమొగనిసందు అనుకూలమాపండు - ఫాలభాగమందులయించి నపండు । కాలూనిఘాతలకడకుజమ్మెటిపండు ॥విక్ర॥ గురువుశిష్యులను కూటమైనపండు - గురుతుచేసుకజనులు కొనరుద్రాక్షపండు।పరశురా

ములవారిక రుద్దైనదాపందు - సరశింహయోగికినమ్మికైనపందు॥విత్ర యించెటి ॥

—*(నరసింహదాసుగారి కీర్తన.)*—

౧౬౦—రాగం పున్నాగవరాళి ఆదితాళం.

విత్తోయమ్మవిత్తు - ఈఘటమెగురునికివిత్తూ ॥ విత్తువిత్తుయని మత్తులకెల్లను - నెత్తురునీరై యెత్తుగమొలచిన ॥ మొలకోయమ్మమొలక - ఈమోహమెగురునికి మొలకా ॥ మొలకమొలకయనినిలువుగ పరచినతిలకపునోదుటను ఫలవృక్షంబగు ॥ చెట్టోయమ్మచెట్టూ- ఈచిత్తమెగురునికిచెట్టూ ॥ చెట్టుచెట్టుయనిపట్టుగవిడువని - ముట్టుగుంట కొకనంటదలంచిన ॥ తీగోయమ్మతీగె - ఈయర్థమెగురునికితీగే ॥ తీగెతీగెయనుకోంగవాంఛఘున - సాగుభోగవిధించిన ॥ మొగ్గోయమ్మమొగ్గ ఈమోహమెగురునికిమొగ్గ ॥ మొగ్గమొగ్గయనిసిగ్గువిడచినిలమొగ్గమీదనొకతగ్గుగనిలచిన ॥ పువ్వోయమ్మపువ్వు - ఈపుణ్యమెగురునికిపువ్వు పువ్వుపువ్వుయనినవ్వుచు నిలచిన - కేవగసాత్త్వియూచివ్వనబుట్టిన॥పిందోయమ్మపిందే - ఈపిండమెగురునికిపిందే ॥ పిందెపిందెయనిసుందరమణులకు - నిందెలుబాపను ముందుగబుట్టిన ॥ కాయోయమ్మకాయ - ఈకాయమెగురునికికాయ ॥ కాయకాయయని మాయనుదెలియగ-శేయమరించిసతోయజాక్షులకు ॥ పండోయమ్మపండు - ఈఅండమెగురునికిపండు ॥ పండుపండుయని కొండలేదుపై -మెండుగనిలచినఖండజాక్షులకు ॥ పరమోయమ్మపరమూ - ఈయర్థమెగురునికిపరమూ॥పరముపరముయని నరయగనిలచిన - నరసింహదాసునికిరువై యుండిన॥ విత్తోయమ్మవిత్తు - ఈఘటమెగురునికివిత్తూ ॥

—*(మువ్వల బాలయ్యగారు కీర్తనలు.)*—

౧౬౧—రాగం ముఖారి చాపుతాళం.

పల్లవి.

కలగంటినమ్మా - సద్గురుని - కనుగొంటినమ్మా॥

అనుపల్లవి.

కలగంటినే నొక్కకమలమధ్యమునందు

కలసిమెలగుచున్నవిలసితంబుగనేను॥కల॥

చ ర ణ ము లు.

నన్నదిడ్డిదూరిసాకారమైయ్యున్న - వెన్నెలబయిటను వెలుగుచున్నగురుని ॥కల॥ మేడైనకోనలోదీటుగయున్నట్టి - పాటించి నేనిప్పుడుఆటలాడెగురుని ॥కల॥ ఫాలభాగమందు లీలతెలసుకోని - వాలలాడుచునున్నమూలమైనగురుని ॥కల॥ ఆరుకమలములుఅరసిచూచినయట్టి మేరుశిఖరమునందు మెరయుచున్నగురుని ॥కల॥ ఏడులోకముల వెలుగుచున్నట్టి - జోడుబాయకనున్న మేడలోపలగురుని ॥కమల॥ కందిమల్లయపల్లెమందిరంబునయున్న - యిందిరయీశ్వరివందనంబులు జేసె॥కల॥ హారుడేరతిరువీధివరబాపనార్యమె - శరణుజేసితినయ్య వరములివ్వమని॥ కల॥ వామభాగమందు వేమలక్ష్మణార్య - నీమముతోడుతధాముని తెలసిన ॥కలగంటినమ్మ ।

——*(కందుకూరి సోమయ్యగారిశిష్యుడుజెప్పినది.)*——

౧౬౨—రాగం కల్యాణి చాపుతాళం

ప ల్ల వి.

శ్రీకరంబుగకనకమేడలోసొంపుతోగూర్చుండరా -

అ ను ప ల్ల వి.

మూకగుంపులగొట్టి మణులహారములుధరియించెరా -

చ ర ణ ము లు.

ఏకుచక్కవలెనునీవు వెలుగుచున్నదేమిరా - జోకతోడుతకందుకురిసోమేశలింగదయానిధే ॥౧॥ వీధిలోనెనిలచిచూడగ వింతపలుకులుపలికెరా - ఖ్యాతిమోదముగొట్టి జీవకీలుతెలసియుండరా । సాధకుండవై తేప్రణవముసారెసారెకుమ్రోవరా - వాసిలేలరకందుకురిసోమేశలింగదయానిధే ॥ ౨ ॥ ఏటినడుమనునిలచి చూడగవెలుతురాయనదేమిరా - మాటిమాటికి నిక్కిచూచితెమంచిమెరుపులుమెఱచెరా । కోటలోనెుకజ్యోతియున్నది కొల్లలాడుచునుండరా - మాటలాడవుకందుకురి సోమేశలింగదయానిధే ॥ 3 ॥ జంటనేత్రములంటిచూచితెజాజుపువ్వులుపూశెరా - మింటిత్రోవనునంటిచూడగ మేఘవర్ణము

గప్పెరా। కంటిలోనెపండువెన్నెలకాయుచున్న దేమిరా - వంటిపాటు నకందుకురిసోమేశలింగదయానిధే ॥౪॥ కనమదగ్గెరకాంతపెద్దమకా వలున్న దేమిరా - వెనకచూడక యెదుర్కొనియెదుయేనుగనుబలిబెట్టె రా। భానుతేజందుదయమాయెను పరమగురునికంటిరా- కన్నుకొన అనుకందుకురిసోమేశలింగదయానిధే ॥౫॥ అర్గరిపులజయించినంతటత త్త్వదెలసియుండరా - ఆరుకమలములందునీవు అండజేరియుండరా। విరిసహస్రకమలమందున మేళలాడుచునుండరా - ధీరుడగుమాకం దుకూరుసోమేశలింగదయానిధే॥౬॥ గంగయమునలనడుమనీవుపొంగు చున్నవదేమిరా - అంగనతోశరాటలాడుచుఅంతరంగమునుండరా। మంగళప్రదమైనకన్యతో మాటలాడుచునుండురా - రంగుమీరగకం దుకురిసోమేశలింగదయానిధే ॥౭॥ ధరణిలోపలకందుకురికరపట్టణంబు నవెలసెరా - స్థిరముగ వేదాంతరహాశ్యముసొంపుతోరచియించరా। కోరిఅష్టపతులుజెప్పినకోటిసూర్యులుభంగిని - వేరుజేయకకందుకురి సోమేశలింగదయానిధే ॥౮॥

—*(శ్రీనరశింహులవారిజెప్పినది కీర్తన.)*—

౧౬౩—రాగం దన్యాసి ఆదితాళం.

పల్లవి.

చల్లజిలికె శరణుసతులకిదిసద్గతియిదిగోఫలమమ్మ -

అనుపల్లవి.

ఉల్లములోపలనమ్మినవారికి అల్లిబిల్లదోవినవమ్మ -

చరణములు.

కల్లగాదు నాముచ్చటనిజమని గైకొనుడిదిగోఫలమమ్మ। ఎల్లు గొన్నమావేల్పురి నరహరివిఖ్యాతిదుగో వినరమ్మ ॥చల్ల॥ వేదాంతంబ నెగోవుల చాలా వెతకి వెతకి తాసాకవలెా - ఆదిని తత్వంబని యే క్షీరాలందులొబాగుగ పితకవలెా। వాదుకొన్నతన దేహంబనియె టిభాండములోపలపోయవలెా। వాదించకజ్ఞానాగ్ని చేతనెవడిలేకుం కగకాచవలెా ॥చల్ల॥ సారపుసత్సద్గతియనియెటి చక్కని మట్టునని లపవలెా। తోరపువేట్కనసాత్వికమనియెటితోడింటప్పుడుబెట్టవలెా

మీాకిననిశ్చయమనియెటిస్తంభం మిక్కిలిదృఢముగ నాటవలెర్ । తసు చుగసుషుమ్నానాళముకవ్వము వనదగవేట్కతో చేయవలెర్॥ చల్లా॥ కేళిమితో ముఖరెండుబంధములు కిందటితాడుగజేయవలెర్ । ఆలోలం బనెయిడపింగళలు ఆకెతాడుగజేయవలెర్ । మేలిమితోడుతజాలంబ నియెటిమీాదటితాడుగజేయవలెర్ । అలరినదృష్టులు రెంటనుతమనిజ హస్తంబులుగజేయవలెర్ ॥చల్లా॥ కనుగవలనియెటిహస్తంబులచే కదలకుండతాపట్టవలెర్ । తననిజధైర్యంబనియెటిప్రాతను తరిమి పెరుగు తాతరుచవలెర్ । తరచితరచితాతరచేటప్పటి వురుతరబిందువులరయవలెర్ । జిజిజిజిపెరుగదితరచేటప్పటి బెరబెరరవము బయెరగవలెర్॥ చల్లా ॥ కరిగికరిగిక్రొమ్మించెటికోడశకళలతినెమ్మతిచూడవలెర్ । తెరలు తెరలుగ ప్రణవంబనియెటిసరసజలంబులచిలుకవలెర్ । స్థిరచిత్తంబునతిసినని స్గుణజరజరమనగాదిప్పవలెర్ । మురిపెంతోడుతనక్కము తలగొముందుగ తాక్నిగ్లార్చవలెర్ ॥చల్లా॥ ఆనందంబనవెన్నముద్దతానప్పటిభావంబెుగవలెర్ - మానుగగాఢసమాధివహ్నినిమట్టడిఆపాయిబెట్టవలెర్। పూనికపరమానందంబనియెటిపొంగులురాగాగాచవలెర్ - శ్రీనరసింహులకృప నదిగ్రోలగసిద్ధించును మాసిద్ధులకర్॥ చల్లాడలికే॥

—*(రెంటాలవారి కీర్తన.)*—

౧౬౪—రాగం పున్నాగవరాళి చాపుతాళం.

పల్లవి.

చదువగనేమిటికే - వేదములెల్ల - చదువగ నేమిటికే॥

అనుపల్ల.

చదువులోపలిచదువుగానక - సర్వకర్మంబొదలగానక - సకల జీవాధారమూర్తిని సంతతముప్రార్థించుటెఱుగక ॥ చదువగ ॥

చరణములు.

పుట్టుగిట్టుసమముగానకపృథివిగడుపుటరాకటెఱుగక । పూనిఆత్మలోనగురునికిపూజలెట్లుజేయు టెఱుగక ॥ చదు॥పాదుకొనిము పుష్పాలకోనలోపంచవన్నెలపలుకుగానక ) పలుకుపై బ్రహ్మాండమెల్లనుప్రబలుచున్నరూపమెఱుగక ॥చదు॥ గండ్లనడిమికి గుండ్లదిరిగికమలమండల

ముందుజేరి । వేకుకలగగ్రణవమపుడు వేదసారంబొడయుబెరుగక ॥ చదు॥ పాయమనెజపమనెజపమంత్రమెరుగక - పరబ్రహ్మము తేజమెరుగక। ఫాలముసరెంటాలగురుడుప్రబలుచున్నరూపమెరుగక॥చదువగనేమిటికే॥

—*(పోతులూరు వీరబ్రహ్మంగారి కొమారుడు)*—

పోతులూరయ్యజెప్పిన కీర్తన.

౧౬౫—రాగం నాదనామక్రియ అటతాళం.

పల్లవి.

దయచేసిగక్షించుదయకుపాత్రుడనేను ధరణిలోలక్ష్మిగోవింద -

అనుపల్లవి.

విలువిగఓంకారవీధిమధ్యమునిన్ను వివరించిచూచెగోవింద ॥

చరణములు.

రెండుయేరులుదాటి కొండమీదనుయున్న - రెండునకైనగోవింద । దండమిదుగో మీకుదయచేసిరక్షించు అండబాయకనుగోవిందా ॥దయ॥ గర్భమందునబుట్టి దుర్బుద్ధివాడనని దూషణంబేలగోవింద । అద్భుతంబైనట్టి అఖిలాండములలోను - నిర్భేదమైనగోవిందా ॥ దయ॥ పాపకర్మినినేను మీపాదములుగొలచి - యేపాపమెరుగగోవింద । పాపలోరూపువై రూపు కాయములోని దీపమైయ్యున్న గోవిందా ॥దయ॥ అండాండ పిండాండపృథివి ఆకాశమున నిండియున్నావు గోవింద । మండలత్రయమునను పండువెన్నెలబైటమెండుకొనియున్న గోవిందా ॥దయ॥ మేరుశిఖరమునందు మేడలోపలనుచిత్కళలతోయున్నగోవింద । బాలకుడ వీరగురుపాలించుపార్వతి - చాలనమ్మితినిగోవిందా ॥దయ॥

—*(దత్తావెంకటయ్యగారి కీర్తన.)*—

౧౬౬—రాగం కాపి చాపుతాళం.

పల్లవి.

పణతీ సద్గురుపాద - భజనజేసితినీ ।

అనుపల్లవి.

పరమాత్మమనులింగ - గురునిదలచితినీ ॥

చ ర ణ ము లు.

కారణాచార్యులకరుణజూచితినీ - కర్మబంధములన్నికడకుజిమ్మితిని ॥పణ॥ ఆరుమతములందు అరసి చూచితినీ - నేతెంచిచూచితినీ । ఆశపాశములన్నికోసివేసితినీ ॥పణ॥ మూడారువాకిండ్లుమూతవేసితినీ - మోక్షద్వారము తలుపుదీశిచూచితినీ ॥పణ॥ మెండైన ప్రణవములో నిండియుండితినీ - దండితేజమునందునుండి వెలసితినీ ॥ పణ ॥ చంద్రసూర్యులరెంటిజంటగూర్చితిని - నేజంటగూర్చితినీ । చెలరేగిచెంగల్వకొలనుజొచ్చితినీ ॥పణ॥ కొలనుజొచ్చినవెనకఫలములందితినీ- ఫలమూలోసద్గురునికలయజూచితినీ ॥పణ॥ దత్తావెంకటగురుస్వాములై నిలచి - పరగశాంభవిలోన భర్గులైవెలసి ॥పణతిసద్గురుపాద ॥

—*(నారాయణమ్మగారి కీర్తనలు.)*—

౧౬౭—రాగం పున్నాగవరాళి చాపుతాళం.

ప ల్ల వి.

ఎగుకకులమువారిచిన్నది - మంచియెలుకగల్లనారిచిన్నదీ

అ ను ప ల్ల వి.

మరువకమాయందుమనసుగలిగినయట్టి
మహిమతేటపరచుచిన్నదీ ॥ఎరు॥

చ ర ణ ము లు.

ఏడుమేడలమీదచిన్నది - నిష్టమెనిమిదింటను వెలుగుచున్నది । నాడుపెరియగోష్టినాలుగుర.త్నాలయీడుజోడైయ్యున్నచిన్నది ॥ ఎఱు ॥ చిత్తారుచవికెలోచిన్నది - విచిత్రమైన వెలుగుగన్నదీ । భక్తిగల్లవారి భావములోపలముక్తికాంతమైనచిన్నది ॥ఎఱు॥ ఆగమరుచిగన్నచిన్నదీ - అయిదురాగములునేర్చియున్నది । యోగమార్గమున భాగవతులగూడి - భోగములొసగినచిన్నది ॥ఎఱు॥ కంటిపాపవంటిచిన్నది - ద్వయజంటరుచులుగన్న చిన్నది । అంటిఅంటనిరెండుజంటాక్షరములు - ఒంటుదెలుపుచునున్నచిన్నది ॥ఎఱు॥ శ్రీకారమైయ్యున్నచిన్నది - శ్రీమద్భాగవతులగూడియున్నది । అకారఉకారమకారముల మూటి - ఏకాక్షరమైన చిన్నది ॥ఎఱు॥ పరులనేలుకున్నచిన్నదీ - పర

మపదము భావముదెలుపుచున్నది । వరుసతో నవవిధ వైభావముల యెందు - చరమశేషినైనచిన్నది ॥ఎఱు॥ మతములో వ్రతమైయున్న ది - ఆరుమతములలో మూలంగన్నది । యతిపతిదాసులహితవుగనే లుచు - మాతైయ్యున్నట్టి చిన్నదీ ॥ఎఱు॥ అష్టపూర్తులమేలుగన్నది- అదినష్టలతోనుండుచున్నది । గోష్టిభావములు కోరినవారికి - ఇష్టము దెలుపుచునున్నది ॥ఎఱు॥ వందనములతోవదగియున్నది - వారచంద లూరుచేరియున్నదీ। ముందుతిరువాయిపురము - ముద్దప్పదేశికులుపొం దునారాయణమ్మబోధదెల్పినతల్లి ॥ఎఱుక ॥

—*(ముచ్చుపాటి సుబ్రహ్మణ్యంగారుజెప్పినది)*—

౧౬౮—పెద్దలను మొరజేయు మేలుకొలుపు

శ్రీగణాధిపుదలచిఆర్యులు చిత్తమున తలపోశివారిని - యోగ జిహ్వానునిలుపుకొని మదివేట్కలూరగనూ । సాగరోక్తులవ్యాసవాల్మీ క శుకశౌనక కపిలగౌతమ - ఆదియోగపురాణపురుషవశిష్టఋషులకు నూ॥ శివశివశరణుశరణు ॥ కాలసమయమువేళశంకరుకాలకాలుని గూల్చివేశిన - కాలవిక్రమధామమార్కండేయయోగికినీ। కాలమా నముదెలసి కాలజ్ఞానమురచియించి జనులకు - కాలనిజముగదయ్యా వీ రప్పయ్యగారికినీ ॥ శివశివ ॥ భారతమురచించినన్నయభట్టుతిక్కన సో మయాజికి - పూర్వభాగవతంబుజేసినపోతరాజుకునూ । ఆరుమతములు వకటిజేసినధీరుడన్నాజయ్యగారికి - రాగరోక్తులరాముదలచినరంగధా మునకూ ॥శివశివ॥ మాటమాత్రమునుమానవాకృతిమహిని జన్మించతని సఖునకు - మాటయిచ్చినదైవపరదేశయ్యగారికినీ । తాటిపత్రితిమ్మి శెట్టికి తాళ్లపాకచినన్నగారికి - మేటిసూత్రసుభోగదత్తాత్రేయయోగి కినీ ॥శివశివ॥ సుజనలోకముకెల్లపత్రికభజనసేయలిఖించిపంపిన - విజ యసోమన్నకవికివీరన్నగారికినీ । సుజనధీరుడుశీలంపాటిగుండాబొట్లు కు లేశుగారికి - రజితభద్రాచలనివాసుకురామదాసుకును॥శివశివ॥ అష్టాం గయోగరసానుభవయోగలక్ష్మప్పతనిపాదము - పట్టుదిట్టముకీర్తిగనుచి ట్టప్పగారికినీ । పుట్టుజ్ఞానిపోతులూరు పురమువీరప్పతనిపాదము-పట్టుధి ట్టముజెప్పదగుసిద్దప్పగారికినీ ॥శివశివ॥పన్నుగహఠయోగప్రభుడవుపసల

పాటిరామిరెడ్డికి - వన్నెమీరినవిందుపురి నాగన్నగారికిని। కన్నలూరి అయ్యగారికి కిమ్మిపాపన్నతని గురునకు - వన్నెకెక్కిన నాస్తిగోవిందయ్యగారికినీ ॥శివశివ॥ పంగచంతన యోగిచన్నంపల్లెచెన్నాస్తిగారికి-చిరలిభేరికేశవులకునుతిమ్మగురునకునూ। పరమపురుష ప్రభా మూర్తిగుప్పాస్తిపాటిపాపరాజుకు - భరితరక్షణకిన్నరబ్రహ్మయ్యగారికినీ ॥శివశివ॥ పాదుకై పాదానలింగముభేదమెంచక కట్టిదిరిగిన - వీరానందుకాళ్వాకాళిబొట్లుకునూ। పాదుకొనిపదహారువిధముగు ప్రమాణఘ తేబొట్లయ్యగారికి - వేదసారము కుప్పుజిమ్మెబసప్పగారికినీ॥శివశివ॥ నెమ్మగచరంభాంగిలింగముమేవరనంజయ్యగారికి - వరపుకాళప్పగారికి అలరాజరాజుకును - కమ్మికాళిలో మాటలాడిన కాళిదాసుకు కివివిరాట్టుకు। కుమ్మరిగుండయ్యకునుగుంభభక్తినన్నయకహా।శివశివ॥కుందనపుయోగ్యనఘుననుకికోనూరిభైరాబులయ్యకు - కందుకూరి పుట్టప్పగారికి నకరాజుకును। బొండిలోకైలాసమొనరిన వాదిలెయామిమ్మవ్వగారికి - పొందుగబల్లానపురముల్లోభోగియీశ్వరునకూ ॥శివశివ॥ సంగరహితఁ తేంద్రియునకును ముంగరాఅప్పన్నగారికి - సత్సంగిగనుగు జంగనికిఅలబెంగులూరయకూ। పొంగుచును యానగిరిపాటిలో పోసిగగుండాలందు ఘుమికిన - రంగమాదిగిపదహార్గురాఱంజవయ్యలకహా ॥శివశివ॥ ఉప్పొంగుచినఉభయ కాలములక్ష్మీనొసగును సకలభాగ్యము - అచ్చమాంబకు మిగులగుంత లింగయ్యగారికినీ। ఎచ్చుగర్రీపోతులూరు వీరసద్గురు పరప్రసాదము - ముచ్చుపాటిసుబ్రహ్మణ్యముముగ్గపలుకులునూ ॥శివశివ శరణుశరణూ॥

—※(కన్నలూరి కీర్తన.)※—

౧౬౯—రాగం శంకరాభరణం రూపకతాళం.

పల్లవి.

మరువలేనురా - గురుని మరువలేనురా ॥

అనుపల్లవి.

మరువకన్నలూరి అయ్యమహామమానసమునసిలచి
చిరతరధ్యానమునెటిశివ్వరూపుఙూపుగునని ॥మరువ॥

చ ర ణ ము లు.

త్రివిధవరుని జేసి త్రివిధవస్తువులనుగలపి - త్రివిధబంధ త్రివిధత నువు త్రివిధచిత్తములనుచాల । త్రివిధలక్ష్య త్రివిధబిందు త్రివిధలక్షణ ములు [illegible]లిపి - త్రివిధసంగరహితుజేరి దివ్యపరముజూపుగురుని ॥మరు॥ నాల్గుసే[illegible]లందుభక్తి నాల్గుసాధనములరక్తి - నాల్గుయోగములనుసక్తి నాల్గుత[illegible]లంపిరక్తి । నాల్గుత్రోవబిలమునడుమనాగకన్యనూరడించి- నాల్గువా[illegible]క్యములును దెలిపినాల్గుపదవులణచుగురుని ॥మరు॥ అష్టతనువు లష్టప్రకృతిఅష్టమదములష్టయోగ - అష్టజ్యోతులష్టబిందుఅష్టజ్యోతు లష్టసి[illegible] । లంకురమునలేకయిపుడు - నిష్టనిర్వికల్పమందు నిజముబో ధించుగురుని ॥ మరు ॥ అక్షరాక్షరములనడుమఅయిదువర్ణమూలుమి గుల - అక్షరములుయాబదింటి హంసతిరిగెనెళవుమూ । దక్షరములు పొందికోనక్షరమునగూర్చివేట్క - అక్షయంబైనపదవిఅమరకలరజూ పుగురుని ॥మరు॥ వాదభేదభేదమోద వర్ణజాలఆశ్రమములు - అధర మూనచెప్పుదూరిఅలనృసింహులనుచుమదిన । బోధజేసి హృదయమం దుపొందుపరచినట్టిగురుని ॥మరు॥ మరువకన్నులూరిఅయ్యమహిమమూ నసముననిలపి - చిరతరధ్యానమనెటిశిష్యరూపుజూపుగురుని ॥మరువ॥

—*(వీరనరశింహులవారికీర్తన)*—

౧౧౦—రాగం ధన్యాసి - ఆదితాళం.

ప ల్ల వి.

నరహరిగలచేటందుకుమూలమునాదోదయమేకారణమూ

అ ను ప ల్ల వి.

పరమభాగవతసంమంధులకునుపాపపుంజనివారణమూ॥

చ ర ణ ము లు.

గంగయమునలునడుమనుయుండె-బంగారంగనపలుకువిని।అం గములోనభుజంగముచేయు-మంగళప్రదమూ అనుదినమూ ॥నర॥ నీరు బుగ్గలనడుమనుయుండే-నీలవర్ణపుఛాయలనూ । కారణమున్నదికను తేజంబై -కానవచ్చుకళానంతతము ॥నర॥ అండములోపలయుండేభాను

మండలపతినారాయణుని । అండజేరుకొనిఆత్మదెలసుకొని-ఆనందించు డీఅనుదినము ॥నరహరిగలచేటందుకు॥

—*(నాగలింగయ్యాగారి కీర్తనలు)*—

౧౪౧—రాగం దన్యాశి ఆదితాళం.

పల్లవి.

పేరుజెప్పుకొనితిరిగితెధరలోపెద్దలుమెచ్చుదురా ।

అనుపల్లవి.

వారకాంతబహుమాటలాడితెవనితలుమెచ్చుదురా ।

చరణములు.

చలనములేకగురురాయునకుసేవజేసినావా- తెలివిగలిగియాకోరినవస్తువుతెచ్చియిచ్చినావా । పొలుపొందగయాగురురాయునకుపూజచేసినావా ॥పేరు॥ మనసుతోడనేకోరికలన్నియుమట్టబెట్టినావా - పనుబడిశ్రీరాజమంత్రమెపఠనజేసినావా। దినదినమాత్మసమాధినిష్టయాతెలివితోనున్నావా ॥ పేరు॥ కాయమనిత్యంబనియెడిమాటగట్టిగవిన్నావా-మాయమాటలవుపదేశములమట్టుతెలసినావా । కాయపోషణజేసేఆశలకాంక్షవిడచినావా ॥పేరు॥ తుదవెలిగేటివాకిలిదెరచితొంగిచూచినావా - మదమత్సర్యగుణాదులయొక్కమట్టుతెలసినావా। విదితంబుగయాప్రణవపీఠమేయెక్కిచూచినావా ॥పేరు॥ కొదువలేకయాతారకచిన్నెలుకొల్లలాడినావా । చెదరకదహరాకాశములోహరిచెంతజేరినావా । కదసిసద్గురుకరంగనిక్రుపచేకలచితెలసినావా॥పేరు॥ దళములనెక్కితెహంసనుదించెతాళిమియెరుగుదువా । కొలుకులుదిప్పుచుకుండలినీశేగురుతుదెలసినావా । నీలంపల్లెలోనాగలింగని నిజముగగన్నావా॥పేరు॥

౧౪౨—తిరునామం కీర్తన. ముఖారి-చాపుతాళం-

హరిహరిరామానుజ-నీమతమందునమ్మినహరిదాసునీ । అరమరలేకతిరుమంత్రముకొరకునై హరియుడనైయ్యుంటినీ ॥ భూములన్నితిరిగితీమంత్రముకొరకు-బుద్ధితోమిముజేరితీ । ఇమ్మనమీవెంటనూ-అలచటలేకవెతకివెతకితిరిగితీ ॥ గోవత్సస్థళమందునా-ఆచార్యులు-దాహముతెమ్మనిరీ । అటుఇటుతిరిగిచూచీ-జలమందాక-ఇదియేమో వోద

మనుచు ॥ ఆకాశమందుచూచీ-అయిదుపక్షు - లంబరవీధినివెళ్లగా ।
పైనపొయ్యేపక్షులా-మీరెళ్లేటి-జలముండేస్థళమెక్కడ ॥ వినవయ్యాహ
రిదాసుడా-మేమెళ్లేటిసీడదప్పకరావయ్యా । పైనపక్షులు వెళ్లగా-నీడ
నునడచి-కొలనుదాపుకువెళ్లెనూ ॥ కౌమండలంబుతోను-తీర్థముతాను
గ్రక్కు-నతీసుకోనీ । మనగురువులేమాయనో-అనుచునుచాల-పరిగెప
రిగెవచ్చెను ॥ అంతటఆచార్యులూ - పరమపదమువేంచేశేకాలమా
య । ఇంతకాలమాయను-ఈబిడ్డకు-అంటదాయనుమంత్రమూ ॥ అ
నుచునుజాలినొంది-మేదినిపైనహస్తముంచితుడచెను । ఘనమైన తిరు
మంత్రమూ-ఆచార్యులు-వినయంబుగనువ్రాసిరీ ॥ దేహమంతటవిడ
చీ-ఆచార్యులు-చేరిరిపరమపదమూ । వీశెసానికక్కతీ-తిరుమంత్రము
విభముగానకచదివెను ॥ ఆకునవ్రాసుకొని-హస్తముతోటి-ఆబారు తు
డచివెళ్లెక । జలముదెచ్చినదాసుడు-ఆచార్యుల-కరముదగ్గిరవుంచెను॥
జలమారగించరయ్యా-ఇకమీదటమమ్మురక్షించరయ్యా ॥ నిద్రలేనిఘ
నులు-ఈస్థళమందు-నిద్రించతగదులెండి । యురమందుచెయ్యివేశీ-ఆ
చార్యుల-ఊపిఊపిపిలచెను ॥ ఆరంగవోరంగరంగస్వామియనుచూ। గు
రువుల స్తముకిందను-చెరుపుటజూచి-గుండెవెగశికొట్టెను ॥ గురువునడు
గనై తిగుట్టుతెలియనై తి-గురువుకుదూరమైతి । తనమనసుధిట్టపరచి-త
నగురువుకు-తగుక్రియలన్ని జేసెక ॥ అంతటహరిదాసుడూ - వెడలిరా
గ-పసులుగాయుచుండెను । పసులగాశెటిబాలుడ-ఈదోవనప్రజలెవ్వ
రెళ్లుందురు । వినవయ్యాహరిదాసుడా-యీదోవన-వీశెవాండ్లువెళ్లిరీ ॥
వీశెసానికబ్బెనాతిరుమంత్రము-వీధెల్లవెగజల్లెనా । ఆటసానికబ్బెనా తి
రుమంత్రము అందరికెరుకాయనా ॥ అందందుతిరుగుచును-చేరిరివారు
హస్తినపురమందునా । పల్లెగుడిశెలయందునా-చోళపురాజుపట్నమం
దునజేరిరీ ॥ అమ్మామమ్మేలుకొమ్మా-చెప్పినపనులు ఆజ్ఞతోచేతునమ్మా ।
మీరుజేశెటిపనులూ-మాకెల్లానుమావొద్దవుండుమనిరీ ॥ ధర్మరాజుజే
శెటీ-యజ్ఞముజూచి-హరిదాసుడువెళ్లగా । ఎవరయ్యహరిదాసుడా-త
ళియకుమీరుయిబ్బందిపడకరండీ ॥ తళియాకు పుచ్చుకొనీ-హరిదాసూ
డు తలచేనుఆచార్యులా। నాగవాసములేని-ఘంట-ఘనఘనయనిమ్రో

యగా । సభవారుఅంతవచ్చి-తెరచాటూన-సభదీరికూర్చుండిరీ । ఎన రయ్యాహరిదాసులూ - మీరిచటికియెందుండి వేంచేస్తిరి ॥ సమయాన ద్వందార్థమూ-తిరుమంత్రాముసమకూడదాయమూకూ । వీరెవాండ్ల వద్దను-తిరుమంత్రముయిప్పిస్తిపదిలతుులూ ॥ ఆమాటవింటూసెధర్మరా జు-ఆశ్చర్యమునబొందెను । వేయుబ్రాంహ్మణులకెల్లా-సమకూడాను - వొక్క-వైష్ణవుడెక్క-వా ॥ వీరెవాండ్లనుపిలచిరీ - దండముబెట్టినాట్య ములాడగాను । ఆయాటజూచిమెచ్చిమేలిమిలిద్దు-లాసతికియివ్వగానే॥ లిద్దులాస్తళమందునా-కర్నముఆకుధరణిపైపడవేసెనూ । ఆయాకుతీసు కోని-ధర్మరాజు-హరిదాసునకివ్వగా ॥ ఆకుపఠనజేశిహరిపురమందూన హరిదాసుడై నిలచెను । హరిదాసుకధలన్నియయూ-విన్నకన్న-(వాశీనచ దివినను॥ఘనమైనపరమపదమూ-చేరుదురుయీూ-జగమందుచాలగాను॥

—*(చుండూరు వీరబ్రహ్మముజెప్పిన మంళహారతి.)*—

౧౭౩ — రాగం-ఆనందభైరవి రూపకతాళం

మంగళంబనుచుబల్కరే-మనగురువరునకు । మంగళంబనుచు బల్కరే ॥ మంగళంబనుచుబల్కరెమంగళాంగునకుస । త్సంగునకుగు రుపవాబ్జభృంగాంచితహృదయునకును॥మంగళం॥ భూతిపూతమేనచెల గగా-త్రిపుండ్రకాంతి । ఖ్యాతినణిమసిద్ధినొందగ।ఆతతమగుగురుప్రసా దమాతురముపడసిజగతి।నీతిమంతుడనగనెగడు।పూతచారిత్రునకును ॥ మంగళం॥ దండికర్ణభూషణుంగరాల్ - గండాంగుళములమండనంబౌన ర్చుచుండగా । మెండురుద్రాక్షపేర్లపుండరీకాసనంబు- ఖండపరశులీల మెరయ।నండజేరిశిష్యసమితి ॥ మంగళం ॥ భూమిసుఖములెల్లవిడచి - మమకారమడచి-వేమలక్ష్మణార్యులగొలచి । ప్రేమమీరశిష్యులకును- కోమలతత్వార్థములను గోముతోడదెలుపుచున్న తామసగుణరహితు నకును ॥మంగళం॥ శ్రీలలరుచెన్నపురమున వాలాయముగను-మేలనిజ నులెన్నవెలసిన । కాలజ్ఞుడు చుండూరుఘనుడురాఘవేంద్రునకు కేలు దోయిగీలుకొల్పి - చాలసంతోషమునను॥మంగళంబనుచుబల్కరె॥

గురుధర్మసారావళియను అద్వైతకీర్తనలు సర్వంబును సంపూర్ణము.